# కొత్తపల్లి

## తెలుగు పిల్లల ఈ (e) మాస పత్రిక

సంచిక:3 జూన్ 2010 సంపుటి: 3

( http://kottapalli.in లోని e - సంచికకు పుస్తక రూపం )

**ఈ సంచికలో. . . .**





గయ్యాళి అత్త




ముఖ చిత్రం: వాన చినుకులు

చిత్రకారుడు: అడవి రాముడు

ఈ మాసపు ముఖచిత్రం

"వాన చినుకులు"



# పనిముట్లు

సుబ్రమణ్యం వాళ్ళ ఇంట్లో గ్యాసు అయిపోయింది. ఇంకా పదిహేను రోజుల వరకూ రాదు. వంటకు కష్టంగా ఉంది. సుబ్రమణ్యం భార్య కమలమ్మ పల్లె మనిషి. కట్టెల పొయ్యి మీద వంట చేయటం వచ్చు, ఆమెకు. అయితే ఇంట్లో కట్టెలు లేవు. అందుకని ఆమె బాగా పోరి, సుబ్రమణ్యం చేతిలో పాత గొడ్డలినొకదాన్ని పెట్టి, అడవికి పంపింది- ఒక మోపెడు కట్టెలు కొట్టుకు రమ్మని.

సుబ్రమణ్యం పట్టణం మనిషి- 'పసుపు కొమ్ములెందుకు, ఒక ప్యాకెట్టు పసుపుపొడి కొనుక్కుంటే పోలేదూ?' అనుకునే రకం. అతను కట్టెలు కొడుతున్న వాళ్ళను చాలామందిని చూసి ఉన్నాడు- కానీ ఎన్నడూ స్వయంగా కట్టెలు కొట్టినవాడు కాదు. అయినా 'ఇదేమంత బ్రహ్మ విద్య?' అనుకున్నాడు. 'అంతమంది అలవోకగా కట్టెలు మోపులు మోపులు కొట్టుకొని తెచ్చుకుంటుంటే, నేను మాత్రం ఎందుకు తేలేను?' అనుకున్నాడు. "మధ్యాహ్నానికల్లా వచ్చేస్తాను చూస్తుండు" అని బీరాలు పలికి, అడవికి బయలుదేరాడు.

అడవిలో చక్కని ఎండుచెట్టును ఒకదాన్ని చూసుకొని, చొక్కా విప్పి, దాన్నీ, తను తెచ్చుకున్న అన్నాన్నీ ఓ చెట్టుకొమ్మకు తగిలించి, వాటంగా పెట్టి చెట్టును కొట్టటం మొదలుపెట్టాడు. కొట్టగా -కొట్టగా, చెట్టుకు గాట్లు అయితే చాలా పడ్డాయి గాని, అది ఇప్పట్లో తెగుతుందని మాత్రం

అనిపించలేదు.

"కట్టెలు కొట్టటంలో ఏదో కిటుకు ఉంటుంది. కొంచెం సేపు కొడితే నాకు పని అలవాటైపోతుంది" అనుకున్నాడు సుబ్రమణ్యం.

అంతలో అటువైపుగా పోతున్న రంగయ్య , సుబ్రమణ్యం పాట్లు చూసి దగ్గరకు వచ్చాడు. అతను రాగానే పనిని ఆపాడు సుబ్రమణ్యం- 'తనకు పని రాదని ఎవ్వరికీ తెలియకూడదు, మరి! "పని ఎప్పటికవుతుంది,ఇలాగ? గొడ్డలి.." అని ఇంకా ఏదో చెప్పబోయాడు రంగయ్య. "పోయి నీ పని చూసుకో!" అని అతన్ని వెంటనే పంపించేశాడు తప్పితే, అతను ఏమంటున్నదీ విననేలేదు సుబ్రమణ్యం.

రంగయ్య వెళ్ళిపోయాక, సుబ్రమణ్యంమళ్ళీ యుద్ధం మొదలు పెట్టాడు, చెట్టుతో. రకరకాలుగా గొడ్డలిని తిప్పుతూ చెట్టును కొట్టాడు. చెమటలుక్రక్కాడు.

మధ్యాహ్నం పనిని ఆపి అన్నం తిన్నాడు. ఆపైన మళ్ళీకట్టెలు కొట్టాడు. బాగా అలిసిపోయాడు- కానీ ఒకపది కట్టెలు మాత్రం తయారైనై, అప్పటికి.

వేరే ఊరికి పోయిన రంగయ్య, సాయంత్రం వెనక్కి వస్తూ సుబ్రమణ్యంను పలకరించాడు మళ్ళీ. "ఉదయం నుండి సాయంకాలం వరకూ కొట్టింది ఈ కాసిని కట్టెలేనా?" అన్నాడు.

"మరి? ఎంత గట్టి కట్టె అనుకున్నావు?" అన్నాడు సుబ్రమణ్యం "నేను ఈ గొడ్డలితో వెయ్యి వేట్లు వేసినా కట్టె విరగలేదు- అంత గట్టి కట్టె!" అన్నాడు.

"నీ గొడ్డలి బాగా మొద్దు బారి పోయింది. దాంతో కట్టెలు కొట్టేందుకు అవుతుందా? కొంచెం పదును పెట్టుకొని ఉంటేనేమి?" అడిగాడు రంగయ్య.

"నువ్వే చూశావు గదా? ప్రొద్దుటి నుండీ నేను ఒక్క క్షణంకూడా వృధా చెయ్యకుండా కట్టెలు కొడుతూనే ఉన్నాను. గొడ్డలికి పదును పెట్టుకునేంత తీరిక ఎక్కడిది?" అన్నాడు సుబ్రమణ్యం, ఆ పది కట్టెల్నే మోపు కట్టుకుంటూ.

గొడ్డలికి పదును పెట్టుకునేందుకు ఒక ఐదు నిముషాలు వెచ్చించి ఉంటే, బహుశ: సుబ్రమణ్యంపని వందరెట్లు తేలికయ్యేది. వందింతలు ఎక్కువ పని జరిగేది.

మనం చదువుకునేందుకు అవసరమైన ప్రధాన పనిముట్లు- పుస్తకాలూ, పెన్నులూ, పెన్సిళ్లూ. ఉన్న డబ్బులన్నింటినీ పైపై మెరుగులపైన వెచ్చించి, "పుస్తకాలు ఇప్పుడు వద్దులే, డబ్బులు లేవు. సంవత్సరం చివర్లో ఏవైనా గైడ్లు, ప్రశ్నలు-జవాబులు చదువుకుంటే చాలులే" అనుకోకూడదు. ఎప్పుడు చేయాల్సిన పనిని అప్పుడు చేస్తేనే అందం. పనిముట్లకు ముందుగానే పదును పెట్టుకోవాలి- ఏమంటారు?

మీ కలాలకు పదును పెట్టటం కోసం, telugu4kids.com నుండి లలితగారు పంపిన బొమ్మనొకదాన్ని ఈ సంచికకు జత చేస్తున్నాం. బొమ్మకు తగిన కథను రాసి పంపితే, నచ్చిన వాటిని ఆగస్టు సంచికలో ప్రచురించగలం.

మీరందరూ శలవల్ని సంతోషంగా గడిపారని అనుకుంటూ-

అభినందనలతో,

కొత్తపల్లి బృందం.




# నీతి చంద్రిక

8 వ భాగం

*మూల రచన: కీ.శే.పరవస్తు చిన్నయ సూరి* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ*

*జరిగిన కథ: కాకి లఘుపతనకుడు, ఎలుక హిరణ్యకుడు, తాబేలు మంథరుడు, జింక చిత్రాంగుడు- ఈ నాలుగూ చక్కని మిత్రులౌతాయి. ఒకనాడు మేతకు పోయిన జింక సాయంత్రం అయి చీకటి పడుతున్నా ఇంకా తిరిగి రాలేదు. కంగారు పడిన మిత్రులు దాన్ని వెతికేందుకై కాకిని పంపుతారు. చూడగా, జింక వలలో చిక్కుబడి ఉంటుంది.. ఇక చదవండి- నీతి చంద్రిక ఎనిమిదవ భాగం.*

వెంటనే లఘుపతనకుడు చాలా వేగంగా ఎగురుకుంటూ పోయి, యీ సంగతినంతా మంథరుడితోటీ, హిరణ్యకుడితోటీ చెప్పింది. ఆపైన అది హిరణ్యకుడితో "మనం తొందరగా పోవాలి. నువ్వు నాఅంత వేగంగా రాలేవు- ఇంతలో ఏమి అవుతుందో తెలీదు. అందుకని, నువ్వు నా వీపు మీద ఎక్కు. నిముషంలో నిన్ను అక్కడికి చేరుస్తాను" అని, దానిని ఒప్పించి ,

తనపైన కూర్చోబెట్టుకున్నది.




ఇక దాని రెక్కలు 'రింగ్, రింగ్' అని శబ్దం చేస్తూండగా, అది బాణంలాగా దూసుకొని-పోయి, చిత్రాంగుడి దగ్గర వాలింది. వెనువెంటనే హిరణ్యకుడు చిత్రాంగుడి కట్టుత్రాళ్లను తెగకొరికి కాపాడి- "మిత్రమా, నువ్వు చాలా తెలివిగలవాడివి గదా, ~~ఈ~~ వలలో ఎట్లా చిక్కుబడ్డావు?" అని అడిగింది.

జింక ఏదో అనబోయేంతలోనే లఘుపతనకుడు దాన్ని వారించి- "మనం ఇక్కడ నిలవకూడదు. ముచ్చట్లు మళ్లీ ఎప్పుడైనా పెట్టుకోవచ్చు. ముందు లేచి ఇక్కడి నుండి పదండి!" అని, వాళ్లను బయల్దేర-దీసింది. ఆపైన అది వాటికి దగ్గరగా పైన ఆకాశంలో ఎగురుకుంటూ పోసాగింది.

నడుస్తూ-నడుస్తూ చిత్రాంగుడు హిరణ్యకుడితో- "ఎంత తెలివైనవాడికైనా, తెలివి తక్కువవాడికైనా- దు:ఖమో, సుఖమో- ఏ సమయంలో ఏది అనుభవించాలో దాన్ని అనుభవించక తప్పదు. సుఖ దు:ఖాలన్నవి, పుట్టిన ప్రతి ప్రాణికీ ఆ పుట్టుకతోబాటే ఏర్పడతాయి. నేను గతంలో చేసుకున్న కర్మ ఎలాంటిదోగాని, చాలా సార్లు ఇట్లాంటి ఆపదలకే లోనయ్యాను"-అని తన ఆత్మకథను చెప్పసాగింది.

"నాకు ఆరు నెలల వయసున్నప్పుడు, నేను మా జాతి వారితో కలిసి తిరుగుతుండగా, ఒక వేటగాడు మాకు తెలీకుండా వచ్చి, వలపన్ని, మంచి పచ్చికను తెచ్చి ఎరగా పెట్టి, కొంత దూరాన- పొదమాటుగా కూర్చొని, చూడసాగాడు. నేనేమో పిల్లతనం కొద్దీ మా మందను విడిచి ముందు పరుగెత్తుతూ,

నాలుగు కాళ్లతోటీ ఎగురుకొని దాటుతూ పోయి, అక్కడ ఎరగా పెట్టిన పచ్చికను చూసి, మేయబోయి, ఆ వలలో చిక్కుకున్నాను.




వెనువెంటనే నేను భయపడి అరవటంతో, మా మందలోని జింకలన్నీ తలలెత్తి, చెవులు రిక్కించి చూసి, మరుక్షణంలో బెదిరి, బండరాతిమీద కొట్టిన కుండ పెంకుల మాదిరి కకావికలై, నలుదిక్కులకూ పారిపోయాయి. ఆ తర్వాత వేటగాడు పొద మాటు నుండి బయటికి వచ్చి, నా దగ్గరే కూర్చున్నాడు."

"నేను చిన్న పిల్లను, జింకను, మా మందనుండి విడిపోయిన ఒంటరిని, వలలో చిక్కుకొని ఉన్నాను, పక్కనే యముడిలాంటి వేటగాడు కూర్చున్నాడు - ఇక నేనేం చెప్పాలి? అప్పటికే నా ప్రాణం మూడు వంతులు పోయింది. తర్వాత వాడు ఒక తాడును నా మెడకు కట్టి, నన్ను పట్టుకొని, నాకు నొప్పి పుట్టకుండా ఆ వల త్రాళ్లను తప్పించి, నన్ను విడిపించాడు. నాకు ఇంకా ఆయుష్షు మిగిలిఉన్నది- కనుకనే వాడు నన్ను చంపలేదు - నన్ను భుజాన పెట్టుకొని పోయి, ఆ దేశపు రాజకుమారుడికి కానుకగా ఇచ్చాడు."

"ఆ రాజకుమారుడు నన్ను తమ గుర్రపుశాలకు ఎదురుగా ఒక కొట్టంలో కట్టేయించి, నాకు గడ్డీ వగైరాలు ఎప్పటికప్పుడు అందించేలా అక్కడి సేవకులకు ఆజ్ఞాపించి, నాపైన గల అనురాగం చేత, ప్రతిరోజూ నా యోగక్షేమాలు విచారిస్తూ వచ్చాడు."

"కాలం గడిచేకొద్దీ నాకు బెదురుపోయింది. మనుష్యులకు మచ్చిక

అయ్యాను. ఇక రోజూ కావలివాళ్ళు రాజకుమారుని ఆజ్ఞతో నా కట్టు వదిలి తిరుగవిడిచేవాళ్లు. నేను ఇష్టంవచ్చిన చోట్లల్లా స్వేచ్ఛగా తిరిగేదాన్ని. రోజంతా తోపులలోను దొడ్లలోను లేత పచ్చికను మేసి, కొలనులలో నీళ్లు త్రాగి, చల్లటి చెట్టు నీడన కొంచెంసేపు నెమరువేస్తూ పడుకొని, చివరికి సాయంకాలానికి- నన్ను కట్టివేసే చోటుకు వచ్చి చేరుకునేదానిని."




"ఒకరోజున నేను ఆ పట్టణవీధుల్లో సంచరిస్తుండగా పిల్లలు కొందరు గుంపుగా నా వెంటపడి అరుస్తూ, `కో' అని కూతలు పెడుతూ, తరిమారు. నేను బెదిరి, చెంగుమని గెంతులు వేసుకొని, దగ్గరలోనే ఉన్న రాజోద్యానవనం ఒకదానిలోకి దూరాను. అక్కడే ఉన్న అంత:పుర స్త్రీలు నన్ను పట్టుకొని-పోయి, రాజ భవనంలోనే, రాకుమారుడు పడుకోనే గదికి దగ్గరగా, ఒక స్తంభానికి కట్టిపెట్టారు."

"ఆనాటి రాత్రి కళ్లు మిరిమిట్లు గొలిపే మెరుపులతో, చెవికి చిల్లులు పడతాయేమోనన్నంత భీకరమయిన ఉరుములతో, కడవలతో వంచి పోసినట్లు నిరంతరమయిన ధారగా, 'భూమి-ఆకాశం ఏకమైనాయేమో' అన్నట్లు కమ్మిన నల్లటి మబ్బులతో- గొప్ప వర్షం కురిసింది. ఆ వర్షాన్ని చూసి నేను చాలా ఉత్సాహపడ్డాను."

"ఆ సంతోషంతో, మనుషుల భాషలో "ఆహా! ఇలా వాన చినుకులు పడుతుంటే, మెల్లగా చల్లగాలి వీస్తుంటే, మా మందతోబాటు చెంగు చెంగున గెంతుతూ, పరుగులు తీస్తూ తిరగగలిగే భాగ్యం నాకెప్పటికి కలుగుతుందో!"

అని నాలో నేను అనుకున్నాను."

"అదే సమయానికి రాజకుమారుడు వసారాలోకి వస్తూ, నా మాటలు విని, అన్ని దిక్కులా కలయజూశాడు. చూసి, తన వెనుక ఉన్న పరిచారకుడితో "అరే, ఇక్కడ వేరే వాళ్లెవ్వరూ లేరు. ఇందాకటి మాటలు నువ్వు కూడా విన్నావు కదా? -ఇదేం వింత? ఈ జింక పిల్ల ఒక్కటే గదా, ఇక్కడ ఉన్నది? 'ఇదే అట్లా మాట్లాడింది' అని నాకు అనిపిస్తున్నది. నువ్వేమంటావు?" అన్నాడు."

"'ఏలినవారి మాట అబద్ధం కాదు. మనం విన్న మాటల్లోని ఆ కోరిక మనిషికి పుట్టదు' అని బదులిచ్చాడు పరిచారకుడు."

"'ఔనౌను, సరిగ్గా చెప్పావు!' అని రాజకుమారుడు నోరు, ముఖం కడుగుకొని పోయి పడుకున్నాడు. ఆ పైన మరునాడు కొలువు కూటమికి వచ్చి కూర్చోగానే, అతను జ్యోతిష్యుడు ఒకడికై పిలువనంపి, జరిగిన సంగతిని మొత్తం వివరించాడు. అది విని ఆ పండితుడు- "జింక మనుష్య భాషను మాట్లాడటం చాలా అనర్థాన్ని సూచిస్తుంది. దీనికోసం జపాలు, హోమాలు చేయించండి. ఆ జింక ఉన్న ఇంటిలో క్షణ కాలం కూడా నిలువరాదు" అని చెప్పాడు."

"అది విన్న రాజకుమారుడు అంత:పురం నుండి నన్ను తెప్పించి "ఈ జింకను దూరంగా అడవిలో విడిచేసి రండి " అని సేవకులను ఆజ్ఞాపించాడు. సేవకులు నన్ను పట్టుకొని పోయి అడవిలో వదిలిపెట్టారు. నేనక్కడ అడవిలో తిరగటం మొదలుపెట్టానో, లేదో- ఒక వేటగాడు నన్ను తరుముకొని వచ్చాడు. నేను భయపడి పారిపోయి, మీ ఆశ్రయం సంపాదించుకున్నాను."

"ఇవాళ్ల ఇక్కడ, వలలో చిక్కి, మళ్లీ నీ దయవల్ల బ్రతికాను. ఇప్పటికీ ముప్పు తప్పిందనలేము- ఇక ముందు జరగనున్నదేమిటో తెలియదు కదా?! నువ్వెంత తెలివైన వాడివో నాకు తెలుసు. నీ కథనంతా మంథరుడు, లఘుపతనకుడు చెప్పారు నాకు. నువ్వు పడ్డ కష్టాలు మాత్రం,

ఎంత చెబితే తీరతాయి? ఇన్ని మాటలక్కరలేదు- విధికి లోబడని ప్రాణి ఈలోకంలోనే ఉండదు." అని తన కథను వినిపించింది, చిత్రాంగుడు.

అలా ముచ్చటించుకుంటూ, "మంధరుడు మన రాక కోసం వేచి ఉంటాడు. మనల్ని చూసేంతవరకూ అతని ప్రాణాలు కుదుటపడవు" అని మాట్లాడుకుంటూ వస్తున్నారు వాళ్లిద్దరూ.

ఆలోగా, అక్కడ మంధరుడు తన మిత్రులందరూ పోయిన వైపుకే చూసు-కుంటూ- "పోయిన వాళ్లు ఇంత వరకూ రాలేదు, ఎందుకు? వాళ్లు పోయిన పని సక్రమంగా జరిగిందో, లేదో? పని జరిగితే ఇంత ఆలస్యం ఎందుకౌతుంది? అయ్యో, ఎట్లాంటి సమాచారం వినాల్సి వస్తుందో, ఏమో! ఏంచేయాలి?" అని ఆందోళన చెందటం మొదలు పెట్టింది. కొంతసేపటికి అది ఇక అక్కడ నిలువలేక, మెల్లగా తనూ ఆ దిశలో నడవడటం మొదలుపెట్టింది.

వెనక్కి తిరిగి వస్తున్న హిరణ్యకుడు మొదలైన మిత్రులు, మధ్య దారిలోనే ఎదురయ్యారు దానికి- అది సంతోషంతో "అయ్యలారా! వచ్చారా! నా కడుపులో పాలు పోసినట్లు అయ్యింది. ఇక త్వరగా పదండి" అని, తను కూడా వాళ్లతోబాటు వెనక్కి రాసాగింది.

అప్పుడు హిరణ్యకుడు ఆ తాబేలుతో "ఒక నిముషం అటు-ఇటూగా రాక మానము కదా? ఇంతలో ఏం మునిగిపోతుంది? ఇట్లాంటి సాహసము చేయకూడదు. ఇక్కడ ఏదైనా ఆపద ఎదురైతే, మేము ఎలాగో ఒకలాగా తప్పించుకోగలము- కానీ నీళ్లల్లో పోయినట్లు, నేలమీద నువ్వు వేగంగా పోలేవు- అందువల్ల 'ఇప్పుడు నువ్వు ఇక్కడికి రావటం మంచిపని' అని నాకైతే ఏమాత్రం అనిపించటం లేదు." అన్నది.

అప్పుడు మంధరుడు "మీరు ఇంత ఆలస్యం చేశారు. మీలో ఒకరైనా ముందుగావచ్చి, జరిగిన సంగతి నాతో

చెప్పవచ్చు కదా? అదీ లేదు! పై పెచ్చు, 'పోయినవాళ్లు ఏమైనారో, ఎలాంటి ఆపదలో చిక్కుకున్నారో' అని నా మనసులో ఆదుర్దా ఎక్కువైపోయింది. నువ్వే చెప్పు, ఇక అక్కడే ఎట్లా ఉండగలను? మిమ్మల్ని చూసిన తర్వాత గానీ నా గుండె కుదుటపడలేదు" అని బదులిచ్చింది.

అవన్నీ ఇట్లా మాట్లాడుకుంటున్న సమయానికి, అక్కడ వేటగాడు తను వల పన్నిన చోటికి వెళ్లి చూశాడు . వలలో పడిన జింక వల త్రాళ్లను తెంచుకొని పారిపో-యిందని కనుగొని, వాడు ఆశ్చర్యపడ్డాడు. ఆపైన వాడు విల్లు ఎక్కుపెట్టి చేతపట్టుకొని , అడుగుల జాడ చూసుకుంటూ, జింక పోయిన దారిలోనే రాసాగాడు .

వాడి రాకను ముందుగానే చూసిన లఘుపతనకుడు "అయ్యో ! మాటల్లో పడి - మీరంతా పెండ్లి నడక నడుస్తున్నారు. వేటగాడేమో, ఇదిగో- వెంబడించుకొని మీదికి వచ్చేశాడు! మాటలకు సమయం లేదు! వెంటనే పారిపోండి!" అని అరిచింది.

మరుక్షణంలో హిరణ్యకుడు ఒక బొరియలోకి దూరింది. చిత్రాంగుడు పారిపోయింది. మెల్లనైన తన స్వభావానికి భయం కూడా తోడవ్వగా , మంథరుడు మాత్రం- నడిచేందుకు కాళ్లు రానట్లు- మెల్లగా పోసాగింది.

## మంథరుడు - ఆపద

'తనను చూసి జింక పారిపోయిందే' అని వేటగాడు బాధపడ్డాడు. అయితే ఆ దగ్గరలోనే వాడికి తాబేలు కనిపించడంతో, వాడు కొంత సంతోషపడి , దాని దగ్గరికి వెళ్లి, పట్టుకొని, దాన్ని తన విల్లుకొనకు కట్టుకొని, ఆ ధనస్సును భుజాన పెట్టుకొని ఇంటిత్రోవ పట్టాడు. ...

('మిత్రలాభం' ముగింపు వచ్చేమాసం.)




# కోడి కూత



*రచన: బి.సురేష్, 10 వతరగతి, ప్రకృతిబడి.*

అనగా అనగా చాలా రోజులక్రితం భారత -దేశాన్ని చూసేందుకు ఒక విదేశీయుడు వచ్చాడు. అతను ఒక సత్రంలో నివాసం ఉండి, ప్రతిరోజూ అక్కడికి దగ్గర్లో ఉన్న సుందర ప్రదేశాలనూ, వింతల్నీ, విశేషాల్నీ చూస్తూ ఉన్నాడు. అదే సత్రంలో చాలా మంది భారతీయులు- విదేశీయులు కూడా ఉన్నారు. ఒకసారి ఈ విదేశీయుడు కొద్ది దూరంలో ఉన్న అందమైన ప్రదేశాలను చూసి అలసి పోయి వెనక్కి వచ్చేసరికి, తన గదిలో ఉండవలసిన విలువైన వస్తువులు లేవు!

అయితే సత్రంలోకి ఆ రోజున క్రొత్త వాళ్ళెవరూ రాలేదు. సత్రంలోని సామాన్లేవీ బయటికి వెళ్ళే అవకాశం లేదు. అంటే, విదేశీయుని వస్తువుల్ని దొంగిలించిన వాళ్ళు ఎవరో సత్రం లోపలి వ్యక్తులే అయి ఉండాలి!

సత్రపు యజమాని వెంటనే సత్రంలో తనకు అనుమానం ఉన్న ప్రదేశాల్లో అంతటా వెతికి చూశాడు- కానీ ఏమీ ప్రయోజనం లేకపోయింది. ఈ దొంగ ఎవరో ఇంటి దొంగే- ఇంటి దొంగను ఈశ్వరుడు కూడా పట్టలేడట- కానీ తను మాత్రం దీన్ని ఎలాగైనా పరిష్కరించాలి- ఎలా?" అని యజమాని చాలా ఆలోచించాడు.

సత్రపు యజమాని భార్య చాలా తెలివైనది. ఆమె అతనికొక ఉపాయం చెప్పింది. దాని ప్రకారం బట్ట కప్పిన పళ్ళాన్నొకదాన్ని అతను అందరికీ కనబడేటట్లు తీసుకొచ్చి ఒక చిన్న, చీకటి గదిలో పెట్టాడు. ఆపైన సత్రంలోఉన్న వాళ్ళనందరినీ పిలిచి, అతను విదేశీయుడిని పరిచయం చేసి, అతని వస్తువులు పోవటం గురించి చెప్పాడు: "మిత్రులారా, ఈ దొంగ పని చేసిన వారెవరో మన మధ్యే ఉన్నారు. వాళ్ళు స్వయంగా బయటపడి తమ తప్పును ఒప్పుకుంటే క్షమించేందుకు నేను, ఈ విదేశీయుడు సిద్ధం. అయినా అలా ఎవ్వరూ బయటపడరు అనిపిస్తున్నది. దీనికొక పరిష్కారం ఉన్నది: చూడండి, చాలా రోజుల క్రితం ఒక సన్యాసి మన సత్రానికి వచ్చి, తిరిగి వెళ్తూ నాకొక కోడిబొమ్మను బహూకరించాడు. అది ఒక మహిమ గల కోడి. దొంగపని చేసిన వాళ్ళను గుర్తుపట్టే అద్భుత శక్తి ఉన్నది దానికి."

"దానిని నేను ఈ చీకటి గది మధ్యలో బల్ల మీద పెట్టి ఉంచాను. మీరు ఒక్కరొక్కరుగా ఇటువైపు నుండి గది లోపలికి వెళ్ళి, లోపల ఆ కోడిని రెండు చేతులతోటీ శ్రద్ధగా తడిమి, అటువైపు నుండి బయటికి రావాలి. మహిమ గల కోడిని దొంగ ముట్టుకున్న మరుక్షణం అది 'కొక్కొరొకో' అని కూత వేస్తుంది. ఇక ప్రారంభిద్దాం. ముందుగా నేనే వెళ్తాను. మీరు ఒక్కరొక్కరుగా నన్ను అనుసరించి రండి" అని గదిలోకి వెళ్ళి అవతలి వైపు నుండి బయట పడ్డాడు.

ఒక్కరొక్కరుగా సత్రంలోని వారందరూ గదిలోకి వెళ్ళి, గది మధ్యలో బల్లమీద పెట్టి ఉన్న

కోడి బొమ్మను తడిమి, బయటికి రాసాగారు. కోడి చప్పుడు చేయటంలేదు. అలా బయటికి వచ్చిన ప్రతివారినీ సత్రపు యజమాని చేతులు పట్టుకొని అభినందిస్తున్నాడు. ఇక మిగిలిన కొద్ది మందిలోనూ దాగున్న దొంగకు చెమటలు పట్టటం మొదలైంది. "తను ముట్టగానే కోడి అరుస్తుంది- ఎలా? దొరకకుండా తప్పించు-కోవటం ఎలా?" అని వాడు ఒకటే ఆలోచించాడు. అంతలోనే వాడి వంతూ వచ్చింది!

గది లోపలికి వెళ్ళిన దొంగ, కోడిని కాదు గదా, దానిని ఉంచిన బల్లను కూడా ముట్ట-లేదు. "ముడితేనే కద, కోడి అరిచేది? ముట్టక-పోతే అది అరవదు, తను పట్టుపడడు!" అని ఆలోచించి, వాడు కోడిని ముట్టనేలేదు. అలా కోడి అరవకుండానే వాడు కూడా రాజాలాగా బయట పడ్డాడు. గది బయటనే ఉన్న యజమాని సంతోషంగా వాడి దగ్గరికి వచ్చి రెండు చేతులూ పట్టుకొని అభినందించ-బోతూనే, ఆగి- "దొంగ దొరికాడు! ఇదిగో దొంగ!" అని అరిచాడు.

బిత్తరపోయిన దొంగవాడికి, తనెలా పట్టుబడిందీ అర్థమే కాలేదు. తను కోడిని ముట్టుకోనేలేదు; అది అరవనే లేదు- అయినా తన దొంగతనం యజమానికి ఎలా తెలిసింది? అందరూ బెదిరించే సరికి, వాడు తన తప్పును ఒప్పుకొని, విదేశీయుడి సామాన్లన్నిటినీ తిరిగి ఇచ్చేశాడు.

ఇంతకీ ఇంటి దొంగను సత్రపు యజమాని ఎలా గుర్తించాడు? కోడిబొమ్మలో నిజంగా ఏం మహిమ ఉన్నది?

*(జవాబు: కోడిబొమ్మను దూదిలాంటి మెత్తటి పదార్థంతో చేశారు. గదిలో పెట్టే ముందుగా , ఇంకుతో దాన్ని బాగా తడిపారు. చీకటి గదిలో దాన్ని తడిమిన వారందరి చేతులకూ ఆ ఇంకు అంటి ఉన్నది. సత్రపు యజమాని వారిని అభినందిస్తున్నట్లు నటిస్తూ, నిజానికి వాళ్ల చేతుల్ని గమనిస్తూ వచ్చాడు. అయితే కోడిని ముట్టుకోని దొంగ చేతులు శుభ్రంగా ఉన్నై- అలా దొంగ దొరికిపోయాడు!)*




# తెల్ల ఏనుగు

*గతంలో రాక్షసులు చేసిన పనినే ఇప్పుడు తెల్లఏనుగు చేసినట్లు కథ అల్లింది కృష్ణవేణి, ఆ కథకు యథాప్రకారం జానపద మెలికలు పెట్టి. ఈ మెలికలూ పాతవే- అయినా ఈ కథ, ఆ పాపకోసం, మీ ముందుకు:*



*రచన: సి.కృష్ణవేణి, 6 వతరగతి, టింబక్టు బడి.*

కళింగ రాజ్యాన్ని విజయేంద్రవర్మ అనే రాజు పరిపాలించేవాడు . ఆ రాజుకు చాలా బలంగల తెల్ల ఏనుగు ఒకటి ఉండేది. మొదట్లో అది ప్రజలతో మర్యాదగా మెలిగేది. అయితే రానురాను దానికి మదం హెచ్చింది. ప్రమాదకరంగా తయారయింది. సంగతిని గ్రహించిన విజయేంద్ర వర్మ రాజ్యానికి ఉత్తరాన ఉన్న ఒక తోటలో ఒక ఇంటిని నిర్మించి, తెల్ల ఏనుగును ఆ యింట్లో కడ్డీలతో బంధించి పెట్టాడు. దాని అవసరాలు చూడటం కోసం ఇద్దరు భటులను నియమించాడు. తనను బంధించినందుకు ఇప్పుడు తెల్లఏనుగుకు

మరింత కోపం వచ్చింది.

రాజుగారి కుమార్తె హరిప్రియ చాలా అందమైనది. రాజుకి ఆమె అంటే ప్రాణం. తెల్లఏనుగును గురించి తెలిసిన రాజు, తన కుమార్తెతో "తల్లీ, ఉత్తరం వైపున ఉన్న తోటలోకి మాత్రం వెళ్ళకు" అని చెప్పాడు. అయితే, ఆయన అలా చెప్పిన మరుసటి రోజు ఉదయమే హరిప్రియకు ఉత్తరం వైపున ఏముందో చూడాలని కుతూహలం కలిగింది. వెంటనే ఆమె తన ఇద్దరు చెలికత్తెలనూ వెంటబెట్టుకొని, ఉత్తరం వైపుకు బయలుదేరింది.

సగం దూరం వెళ్ళాక, చెలికత్తెలు "మనం ఎక్కడికి వెళ్తున్నాం, యువరాణీ?" అని అడిగారు. "ఉత్తరం వైపున ఉన్న తోటలోకి" అన్నది హరిప్రియ.

"మహారాజుగారు వెళ్ళొద్దని చెప్పారుగా యువరాణిగారు, మాకు భయంగా ఉంది" అని ఒక చెలికత్తె భయంతో పరుగు తీసింది. అయినా హరిప్రియ ఆగకుండా రెండవ చెలికత్తెతో కలిసి తోటలోకి ప్రవేశించింది. తోట అందంగా, మెరిసిపోతున్నది. చూస్తూ నడుస్తున్న హరిప్రియ మురిసిపోతున్నది. అలా పోయి పోయి , తెల్లఏనుగును బంధించిన ఇంటి దగ్గరికి చేరుకున్నది హరిప్రియ.

అంతలో లోపల ఉన్న భటుడు బయటకు వచ్చి "లోపలికి రాకూడదు" అని ఆమెను అక్కడినుండి పంపించే ప్రయత్నం చేశాడు. కానీ యువరాణి వినకుండా "నేను లోపలికి వె ళ్లి తీరాలి" అని మొండిగా వాదించ సాగింది. లోపల ఉన్న తెల్ల ఏనుగు యువరాణి మాటలను విని సంగతిని గ్రహించింది. అమిత బలశాలి అయిన ఆ ఏనుగుకు తనను బంధించిన కడ్డీలు ఒక లెక్కలోనివి కావు. అది క్షణంలో కడ్డీలను త్రెంచుకొని, అడ్డు వచ్చిన భటుడిని త్రొక్కేసి, తలుపులు పగులగొట్టుకొని, బయటకు వచ్చి యువరాణి హరిప్రియను ఒక్క ఉదుటున ఎత్తుకుని అడవిలోకి పారిపోయింది.

ఈ వార్త తెలిసిన మహారాజు హతాశుడై,

కుప్పకూలిపోయాడు. ఇప్పుడు ఇక రాజ్యభారం వహించవలసినది మంత్రులే. విజయేంద్రవర్మ తరువాత రాజ పీఠాన్ని అధిష్ఠించవలసిన హరిప్రియను తెల్లఏనుగు ఎత్తుకుపోయిందనే వార్తతో రాజ్యం అంతా అల్లకల్లోలమైంది. విజయేంద్రవర్మను పరీక్షించిన రాజవైద్యులు పెదవి విరిచారు- హరిప్రియ వస్తే తప్ప ఆయన ఆరోగ్యం బాగుపడదన్నారు.

సాహస వీరులు అనేకమంది తెల్ల ఏనుగును వెతుక్కుంటూ తిరిగారు, గానీ అది ఎవ్వరికంటా పడలేదు. వీరయోధులందరూ ఉత్తిచేతులతోవెనక్కివచ్చారు.

ఆ రాజ్యంలోనే ఒక ఊరితోటలో పని చేసే సతీష్ చాలా తెలివైనవాడు, ధైర్యవంతుడు కూడాను. రాజుగారికి , యువరాణికి వచ్చిన ఆపదను తెలుసుకున్నప్పటి నుండి వాడు 'వాళ్ళకు ఎలా సహాయపడాలి?' అని అనుకుంటూనే ఉన్నాడు- "వీరయోధు- లందరూ ప్రయత్నించారు- కానీ తెల్ల ఏనుగు ఎవ్వరికీ కానరాలేదు " అని తెలిసిన తరువాత వాడు "నేనూ వెతుకుతాను తెల్ల ఏనుగును" అని బయలు దేరాడు.

అలా బయలుదేరిన సతీష్ సముద్ర తీరాన ఉన్న ఒక అడవిని చేరుకున్నాడు. మిట్ట మధ్యాహ్నం వేళ ఆ అడవి మధ్యలో ఒక చెట్టు కింద ఋషి ఒకాయన తపస్సు చేస్తూ కనిపించాడు. ఆయనను అడిగితే తన పని నెరవేరుతుందని అనిపించింది సతీష్ కి. మెల్లగా ఆయన ముందు నిలబడి, నమస్కరించి, తన మనసులో మాట చెప్పి, సహాయం చేయమని కోరాడు. అయితే ధ్యానంలో ఉన్న ఋషి ఉలకలేదు; పలకలేదు.

అయినా సహనం కోల్పోని సతీష్ అక్కడే ఉండి, ఋషి స్వయంగా కళ్ళు తెరిచేంత వరకూ అక్కడే నిలబడి ఉండాలని నిర్ణయించు- కున్నాడు.

ఋషి ఏకబిగిన మూడు రోజులపాటు కళ్ళు తెరువలేదు. సతీష్ స్థిర నిశ్చయంతో మూడు రోజులపాటు అలాగే నిలబడి

ఉండిపోయాడు. అప్పుడు కళ్ళు తెరిచిన ఋషి సతీష్ పట్టుదలను చూసి సంతోషించి, "చూడు నాయనా! నేను నీకు రెండు రాళ్ళను ఇస్తాను. ఒకటి తెల్లరాయి, మరొకటి నల్లరాయి- వాటిని తీసుకొని వెళ్ళు, తెల్లరాయిని విసిరితే నీకు యువరాణి ఉన్న చోటు వరకు దారి వస్తుంది.




దారిమధ్యలో క్రూర మృగాలు తిరుగు తుంటాయి. నువ్వు వాటిని ఏమీ అనవద్దు. నల్లరాయి వల్ల నీకు అమితమైన బలం వస్తుంది. అయితే నల్లరాయి నీకు ఒక్కసారికి మాత్రమే పనిచేస్తుంది- జాగ్రత్తగా వాడుకొని విజయం సాధించు" అని, ఋషి రెండు రాళ్ళను సతీష్‌కి ఇచ్చి ఆశీర్వదించి పంపాడు.

సంతోషించిన సతీష్ వాటిని తీసుకొని సముద్ర తీరానికి వెళ్ళి, తెల్లరాయిని విసరగానే తెల్ల ఏనుగు యువరాణిని దాచి ఉంచిన తోట వరకూ దారి ఏర్పడింది. దారి మధ్యలో క్రూర మృ గాలు తిరుగుతున్నాయి. సతీష్ వాటిని పట్టించు కోకుండా యువరాణి వద్దకు చేరుకున్నాడు.

ఆ సమయానికి తెల్ల ఏనుగుకు మరింత మదమెక్కి, యువరాణిని త్రొక్కి వేసేందుకు ముందుకు దూకుతున్నది. సతీష్ గబుక్కున ఆ ఏనుగు ముందుకు దూకి, దానికి నమస్కరించి- "తెల్ల ఏనుగూ, నిన్ను జాగ్రత్తగా సంరక్షించిన విజయేంద్రవర్మ నువ్వు చేసిన పని కారణంగా అనారోగ్యం పాలై ఉన్నాడు. రాజ్యం అల్లకల్లోలంగా ఉన్నది. దయచేసి యువరాణిని ఏమీ చేయకు. ఆమెను నాకు అప్పగించు" అన్నాడు.

తెల్లఏనుగు కోపంగా సతీష్‌ను తొండం-

తో ఎత్తి దూరంగా విసిరేసింది. అప్పుడు ఇక సతీష్ ఋషిని తలచుకొని నల్లరాయిని విసిరాడు . దాంతో సతీష్ కు ఏనుగుతో యుద్ధం చేయటానికి అవసరమై-నంత బలం చేకూరింది. అలా వచ్చిన బలంతో సతీష్ ఏనుగుతో పోరాడి, దాన్ని లొంగదీసుకున్నాడు.

ఆ తరువాత, అతను "ఓ తెల్లఏనుగూ! కేవలం ఋషి సాయం వల్ల నిన్ను లొంగదీసుకొనగలిగాను తప్ప, నిజానికి నేను నీకంటే బలమైన వాడిని కాను.

కోపం కొద్దీ నువ్వు చేసిన పని ఏమంత మంచిది కాదు- విజయేంద్రవర్మ లాంటి మంచిరాజును కోల్పోయి దేశం అల్లాడుతున్నది. ఇప్పటికైనా నన్ను అర్థం చేసుకొని, యువరాణిని వదిలిపెట్టు. కావాలంటే నువ్వు ఇప్పుడు నన్ను పిప్పి పిప్పి చేసెయ్యచ్చు- ఋషి నాకిచ్చిన బలం అయిపోయింది. అయినా నువ్వు స్వతహాగా మంచిదానివని నా నమ్మకం. అందుకని నేను నీకు మనస్ఫూర్తిగా స్వేచ్ఛను ప్రసాదిస్తూ, యువరాణిని వదిలిపెట్టమని అభ్యర్థిస్తున్నాను." అన్నాడు.

తెల్లఏనుగు కొద్దిసేపు కదలకుండా నిలబడింది. ఆపైన అది సతీష్ ను తొండమెత్తి ఆశీర్వదించి, వెనక్కి తిరిగి అడవిలోకి వెళ్ళి పోయింది.

యువరాణి హరిప్రియను ప్రాణాలతో చూడగానే విజయేంద్రవర్మ మహారాజు ఆరోగ్యం కుదుట పడింది. రాజ్యం మళ్ళీ సుఖ శాంతులతో కళకళలాడింది.

## తల షేవింగ్

జోకు

*సేకరణ: బి. చంద్ర, 9 వతరగతి, ప్రకృతి బడి.*

పవన్ ఒకసారి మంగళ షాప్ కు వెళతాడు. పవన్ చాలా పిసినారి. మంగళాయనతో కటింగ్ చేస్తే ఎంత తీసుకుంటావు అని అడుగుతాడు. అతను పది రూపాయలు అంటాడు.షేవింగ్ చేస్తే ఎంత? అని అడుగుతాడు.ఐదు రూపాయలు అని అంటాడు. అప్పుడు పవన్ నా తలకు షేవింగ్ చేయి అని చెప్పాడు.




# వారసుడి ఎంపిక



*రచన: ఏ.గాయిత్రి, 9 వతరగతి, టింబక్టు బడి.*

అవంతీపురాన్ని చంద్రవర్మ అనేరాజు పరిపాలిస్తుండేవాడు. ఆయనకు తన రాజ్య ప్రజలంటే చాలా ఇష్టం. ఆయనకు చక్కని సలహాలిస్తూ అనేక సంవత్సరాలు పనిచేసిన మంత్రికి వయసు పైబడింది. ఇప్పుడు పని భారం అవుతున్నది. విశ్రాంతి కోరుతున్నా-డాయన.

రాజుగారు ఆయనతో "మంత్రిగారూ! మీరు మీ ఇష్ట ప్రకారమే విశ్రాంతి తీసుకోవచ్చు-అయితే దానికంటే ముందు, మీ స్థానంలో సమర్థత గల వేరొక మంత్రిని నియమించే బాధ్యత మీదే" అన్నాడు.

వృద్ధ మంత్రి తెలివైనవాడూ, మంచివాడు కూడానూ. ఆయన "సరే మహారాజా! నేనే స్వయంగా మన రాజ్యంలో తగిన వ్యక్తిని నా వారసుడిగా ఎంపిక చేస్తాను"

అని, మంత్రి పదవికి అర్హతలున్న వారినందరినీ రమ్మని చాటింపు వేయించాడు. తెలివితేటలకూ, మేధస్సుకూ సంబంధించి ఆయన పెట్టిన రకరకాల పరీక్షల్లో ముగ్గురు అభ్యర్థులు ఉత్తములుగా ఎంపికయ్యారు. మంత్రి పదవి వారిలోఎవరిని వరించాలో వృద్ధ మంత్రి స్వయంగా నిర్ణయించుకోవలసి ఉన్నది.

మంత్రిగారి ఇంట్లో మంత్రి, అతని అవ్వ మాత్రమే ఉండేవారు. పరీక్షలు పెట్టిన రోజున, మంత్రిగారు ఈ ముగ్గురినీ తమ ఇంట్లోనే ఉండమన్నారు. "ఇప్పుడు రాత్రి అవుతున్నది కదా, ఈ రాత్రికి ఇక్కడే భోజనం చేసి పడుకోండి. ఉదయం లేవగానే రాజుగారి వద్దకు వెళ్దాము" అని చెప్పాడు వాళ్ళకు.

వాళ్ళు ముగ్గురూ భోజనం చేశాక, అవ్వ "నాయనలారా, మీకు ముగ్గురికీ మూడు గదులిమ్మన్నారు. లోపల ఉన్న మూడు గదులూ మీవి. వెళ్ళి పడుకోండి" అన్నది వాళ్ళతో. మొదటి ఇద్దరూ "మేము బాగా అలసి పోయాం అవ్వా, పడుకుంటాం" అని వెళ్లి, లోపలి గదుల్లో పడుకున్నారు. చివరి వాడు మాత్రం "అవ్వా! కొత్త ప్రదేశం కదా, నేను బయట పడుకుంటాను" అన్నాడు.

అందుకు అవ్వ "నాయనా! బయట చాలా చలిగా ఉన్నది; అదీ కాక ఈ రాజధానిలో దొంగల భయం ఎక్కువ. వద్దు నాయనా! ఇంట్లోకి వచ్చి పడుకో !" అన్నది. "లేదు అవ్వా, నాకు ఇది మామూలే. ఎంత పెద్ద దొంగలైనా నేను భయపడేది లేదు. లోపల వద్దు- బయటే పడుకుంటాను. ఈరోజు వచ్చారంటే దొంగలు దొరికారన్నమాటే!" అని చెప్పి పడుకున్నాడు.

అర్థరాత్రి కావస్తుండగా మొదటివాడికి మెలకువ వచ్చింది. చూడగా, గది కిటికీ దగ్గర ఏదో ఆకారం, తెల్లటి ముసుగు వేసుకొని, నిలబడి ఉన్నది. వాడికి స్వతహాగా దయ్యాలంటే భయం. అందుకని, వాడు వణుక్కుంటూ లేచి, హడావిడిగా రెండోవాడున్న గదిలోకి మారిపోయాడు.

రెండోవాడికి మొద్దునిద్ర. వాడొకసారి

నిద్రపోయాడంటే ఏ దయ్యాలూ వాడిని నిద్ర లేపలేవు. తన గదిలోకి మొదటివాడు వచ్చి పడుకున్న సంగతే తెలియదు, వాడికి!

అయితే ఆ అలికిడికి బయట పడుకున్న మూడోవాడు లేచాడు. బయట తిరుగుతున్న ఆ ఆకారాన్ని చూడగానే అది ఎవరోమనిషని వాడికి అర్థం అయ్యింది. ఆ ఆకారం మంత్రి గారి ఇంట్లోకి జొరబడుతుండగా చూసి, మూడోవాడు దాన్ని వెంబడించాడు. ఆ ఆకారం నేరుగా మంత్రిగారి నగల భోషాణం దగ్గరికి వెళ్లింది. తన జేబులోంచి తాళాల గుత్తిని తీసి భోషాణం తలుపులు తెరిచింది. లోపలున్న నగనొకదాన్ని అందుకునేందుకు చేతులు లోపల పెట్టిందో, లేదో- మూడోవాడు దాని వెనకగా వెళ్ళి, గది తలుపులు మూసి గొళ్ళెంపెట్టేశాడు.

"ఎందుకు, మంత్రిగారి ఇంట్లోనే దొంగతనానికి వచ్చావు? ఏమేమి తీసుకెళ్దా-మనుకున్నావు? మర్యాదగా చెప్పు! లేక పోతే అందరినీ పిలుస్తాను. అందరూ వచ్చి నిన్ను చితక బాదుతారు. నీకు ఉరిశిక్ష ఖాయం!" అన్నాడు మూడోవాడు, బయట కిటికీలోంచే, ఆ ఆకారంతో.

"ఉష్.. గట్టిగా అరవకు! నన్ను వదులు. ఎన్నోరోజులు కష్టపడి నేను ఈ తిజోరీ తాళం చెవులు సంపాదించాను. నన్ను వదిలితే ఈ నగల్లో సగం నీకే ఇస్తాను" అన్నది ఆ ఆకారం, మూడోవాడితో, గుసగుసగా.

"నాకే డబ్బులు ఆశ చూపిస్తావా?" అని, మూడోవాడు గట్టిగా అరిచి, అందరినీ నిద్రలేపాడు.

అయితే, ఆ దొంగను పంపింది స్వయంగా వృద్ధ మంత్రే! ఈ ముగ్గురు అభ్యర్థుల లక్షణాలనూ పరిశీలించటంకోసమే ఆయన తన సేవకుడిని అలా నటించమని ఆదేశించాడు! అందరికీ ఆయన ఆ సంగతిని తెలియజేసి, మూడవవాడి ధైర్యాన్నీ, తెలివినీ, నిజాయితీనీ ప్రశంశించాడు. అతనినే తన వారసుడిగా ఎంపిక చేసుకున్నాడు!




# బాబీ

అమ్మమ్మ చెప్పిన కథ

*రచన: వేదం గీతమణి, హైదరాబాదు.*

బాబీ ఎనిమిదేళ్ళ అల్లరి పిల్లవాడు. వాడి అసలు పేరు ఏంటో తెలీదు- వాళ్ళమ్మ వాడిని 'బాబీ' అని పిలుస్తుంది కాబట్టి, మనం కూడా 'బాబీ' అందాం. వాడికి అల్లరెక్కువ. ఎప్పుడూ ఏదో ఒక తుంటరి పని చేసి వాళ్ళమ్మని విసిగిస్తూ ఉంటాడు.

ఒక రోజు ఎప్పటిలాగే, బాబీ స్నానం చేసి బడికి వెళ్ళిపోయాడు. మార్నింగ్ స్కూలు కావడంతో, పదకొండు కల్లా ఇంటికి వచ్చేసాడు. ఇంటికి రాగానే అమ్మ బాబీతో-

"బాబీ, సబ్బును ఏం చేశావు? పొద్దున్నే కదా కొత్త సోప్ తీశాను, ఇప్పుడు అది లేదేమిటి?" అని అడిగింది.

"నాకు తెలీదమ్మా, నేను స్నానం చేసినప్పుడు అక్కడే ఉంది"- అనేసి, బాబీ మరేం మాట్లాడకుండా వెళ్ళిపోయి బొమ్మలతో

ఆడుకోవడం మొదలుపెట్టాడు.

"మరి ఎక్కడికి పోయింది?" మళ్ళీ అతని దగ్గరకు వచ్చి అడిగింది వాళ్ళమ్మ.

"నాకు తెలీదు మా. నువ్వు, నాన్ననో, అక్కనో, లేకపోతే పనిమనిషి ఆంటీనో అడుగు." అన్నాడు బాబీ, అమ్మ వైపుకి చూడకుండా.

వాళ్ళమ్మ ఇంక బాబీని అడగడం దండగ అనుకుని, వెళ్ళిపోయింది. సాయంత్రం అక్క కాలేజీ నుంచి రాగానే, వాళ్ళమ్మ మళ్ళీ ఆమెని అడిగింది సబ్బు గురించి.

"నాకెలా తెలుస్తుంది అమ్మా, పొద్దున్నే అందరికంటే ముందు  స్నానం చేసింది నేనే కదా? నా తర్వాత మీరంతా చేసారు కదా..." -అన్నది బాబీ వాళ్ళక్క.

"ఓహో, అవునవును- చివరగా స్నానం చేసింది బాబీనే .  వాడికే తెలియాలి" -అని, వాళ్లమ్మ  "ఒరే బాబిగా, ఇలారా!" -అని పిలిచింది.

"ఆడుకోవడానికి వెళ్తున్నాను, విక్రం తో..." అని నసిగాడు బాబీ.

"వెళ్దువు గానీ, ఆ సోప్ ఏం చేశావు, చెప్పు మొదట..." అంది వాళ్ళమ్మ.

"నేనేం చేయలేదు అమ్మా...నిజం. మొన్న టీవీలో చూపించారే... ఏదో దయ్యం కథ? అది మనింటికి వచ్చి తీస్కెళ్లి పోయిందేమో...." అన్నాడు బాబీ.

"ఏరా, వేషాలేస్తున్నావు? దయ్యం వచ్చి సోపు ఎందుకు తీస్కెళ్తుంది?"

"ఏమో అమ్మా, దయ్యం దగ్గర సోప్ లేదేమో. మనింట్లో నువ్వు కొత్త సోపు తీయడం చూసి, తీసుకు వెళ్ళిందేమో."-అమాయకంగా అన్నాడు బాబీ.

"దయ్యం మనింటి చుట్టూ ఎందుకు తిరుగుతుంది?"

"నిన్న దయ్యం సీరియల్ వస్తూ ఉంటే కరెంటు పోయింది కదమ్మా, దాంతో అది ఇక్కడే ఉండిపోయి ఉంటుంది. పొద్దున్న

మేము వెళ్ళగానే నువ్వు టీవీ ఆన్ చేసి ఉంటావు కదా, అప్పుడు మళ్ళీ టీవీలోకి వెళ్ళిపోయిందేమో"- బాగా ఆలోచించి చెప్పాడు బాబీ.

ఆ జవాబుకి అమ్మా, అక్కా ఇద్దరూ గట్టిగా నవ్వారు. అంతలో బాబీ వాళ్ళ నాన్న ఆఫీసు నుండి వచ్చేయడంతో కాసేపు, ఈ విషయం వదిలేశారు అందరూ. బాబీ ఆడుకోడానికి వెళ్ళిపోయాడు.

కాసేపు అయ్యాక, రాత్రి భోజనాల సమయంలో బాబీ వాళ్ళమ్మ నాన్నతో చెప్పింది - సోపు మాయమైన సంగతి.

"సబ్బే కదా, ఎందుకంత కంగారు , నీకు అసలు?" అన్నారు నాన్న. "నిజమేలెండి. ఏమిటో, కొంచెం వింతగా అనిపించి చెబుతున్నా, అంతే. ఐనా, బాబిగాడు మాత్రం భలే కథ చెప్పాడండీ -దయ్యం ఎత్తుకుపోయిందని..." అని నవ్వింది అమ్మ.

అమ్మ చెప్పటం పూర్తయ్యేసరికి, బాబి గాడు ఉన్నట్లుండి ఏడుపు మొదలుపెట్టాడు. ఎవరికీ ఏమీ అర్థం కాలేదు.

"ఏరా బాబీ, ఎందుకు ఏడుస్తున్నావు?" - అని అడిగారు నాన్న.

"నాన్నా, మరే.. మీరు నన్ను కొట్టనంటే చెబుతాను..." అన్నాడు బాబీ ఇంకా ఏడుస్తూనే.

"చెప్పరా..ఎవ్వరం ఏమీ అనంలే..." అంది అమ్మ.

"ఆ సోప్ ఏమైందో నాకు తెలుసు" - అని ఆపాడు బాబీ.

"అనుకుంటూనే ఉన్నా. ఏం చేశావు?" - అంది అమ్మ.

"పొద్దున్న స్నానం చేస్తున్నప్పుడు సోపు తో ఆడుకుంటూ ఉంటే, అది జారి, కాలువలో పడిపోయింది. మీకు చెబితే తిడతారని, చెప్పలేదు.." అన్నాడు బాబీ.

"మరెందుకు రా ఇప్పుడు చెప్తున్నావు?" - అని అడిగింది అక్క ఆశ్చర్యంతో.

"ఏమో, ఇప్పుడు 'ఏమీ అనరులే' అనుకొని, చెప్పేసాను" అన్నాడు బాబీ అమాయకంగా.

"విషయం దాచిపెట్టేద్దాం అనుకున్నాడు. పాపం, వాడే చెప్పేశాడు! అమాయకపు బాబీ.." అని నవ్వింది అక్క.

అమ్మా, నాన్నా కూడా పెద్దగా నవ్వారు.

కొన్ని క్షణాలు అయోమయంగా చూసినా, ఆ తర్వాత బాబీ కూడా నవ్వటం మొదలుపెట్టాడు.

జోకు

## శివ ధనుస్సు

సేకరణ: టి. ఆది నారాయణ, సి.ఆర్.సి. చెన్నేకొత్తపల్లి.

బడికి తనిఖీ చేసేందుకు అధికారిగారు వచ్చారు.

**అధికారి:** బాబూ, నువ్వు చెప్పు! "శివధనుస్సును ఎవరు విరిచారు" అని అడిగాడు.

**శివ(ఏడుస్తూ)**: సార్, "నిజంగా ఎవరు విరిచారో నాకు తెలియదు సార్ అని చెప్పి ఏడ్వటం మొదలుపెట్టాడు".

**అధికారి:** ఓరి! సరే నువ్వు చెప్పు బాబూ "శివధనుస్సును ఎవరు విరిచారు".

**గణేష్(భయంభయంగా):** "సార్, నేను మాత్రం విరచలేదు సార్. ఆ రోజు నేను బడికే రాలేదు. మా నాన్న నన్ను పనిమీద తోటకు పంపించాడు ."

**అధికారి(టీచరు వైపుకు తిరిగి):** ఏంటి సార్ శివధనుస్సును ఎవరు విరిచారు అని అడుగుతుంటే ఒక్కరు కూడా సరైన సమాధానం చెప్పలేదు. కనీసం నువ్వైనా చెప్పు.

**టీచరు:** "నేను రెండు రోజుల నుండి బడికి సెలవు పెట్టాను, నాకు తెలియదు సార్!"

అధికారి కోపంగా ఇలా కాదు. నీ మీద చర్య తీసుకోవాలి. ప్రధానోపాధ్యాయుల్ని పిలవండి. (ప్రధానోపాధ్యాయులు వచ్చారు.)

**అధికారి:** ఏంటి సార్ ఇది శివధనుస్సును ఎవరు విరిచారు అని అడుగుతుంటే ఒక్కరు కూడా సరైన సమాధానం చెప్పలేదు.చివరికి క్లాసు టీచరు కూడా.

**ప్రధానోపాధ్యాయులు:** ఇంత కష్టం ప్రశ్న అడిగి సమాధానం చెప్పాలని ఇంత పట్టుపట్టడం ఏమీ బాగలేదు సార్. "ఎంత అవుతుందో చెప్పండి సార్! స్కూల్ ఫండ్ నుంచి తీసి ఇచ్చేస్తాం ."

అధికారి: ఆ..ఆ..ఆ.!




# తొందర పాటు

*రెండు కథల సమాహారంగా రాజమ్మ సృష్టించిన ఈ కథకు మూడవ కథను జోడించి, మలి పలుకు చేర్చాం మేము. చదవండి..*



*రచన: పి.రాజమ్మ, 9 వ తరగతి, ప్రకృతి బడి.*

పూర్వం ఒక నగరంలో ఒక రాజు ఉండేవాడు. రాజుకు ముగ్గురు కొడుకులు ఉండేవాళ్ళు. ఆ రాజు తన రాజ్యాన్ని, ప్రజల్ని చాలా బాగా పాలిస్తుండేవాడు.

ప్రజల సమస్యల్ని తెలుసుకునేందుకు, వాటిని ఎప్పటికప్పుడు పరిష్కరించేందుకు- గాను రాజు తన కుమారులు ముగ్గురికీ ఊరి చివర మూడూ గుడిసెలు వేయించాడు- వాళ్ళు రాత్రిపూట అక్కడే ఉండి, ప్రజలకు సాయం చేయాలి.

ఒకనాటి రాత్రి పెద్ద కుమారుడు రాజ్యం అంతటా తిరిగి చూశాడు- అంతా ప్రశాంతంగా

ఉన్నది. మొదటి జాము ముగిసిన తర్వాత అతను వచ్చి పడుకున్నాడు. కొద్ది సేపటికి రెండవ వాడు లేచి, రాజ్యంలో తిరిగి చూశాడు. అందరూ నిద్రలో ఉన్నారు. రెండవ జాము ముగిసిన తరువాత అతను వచ్చి పడుకున్నాడు; మూడవవాడు రాజ్యంలో తిరిగి చూశాడు.

ఆ సమయంలో రాజ్యం నుండి ఒక అందమైన స్త్రీ బయటకు వెళ్ళడం చూశాడు అతను. వెంటనే ఆమె దగ్గరకు వెళ్ళి "ఎవరు నువ్వు? ఈ సమయంలో ఇక్కడ ఎందుకు తిరుగుతున్నావు?" అని అడిగాడు. ఆమె వెంటనే "నేను ఈ రాజ్యాన్ని కాపాడే దేవతను. ఇప్పుడు ఇక బయటకు వెళ్ళి పోతున్నాను. ఏమంటే, ఇంకొంచెం సేపట్లో ఈ రాజ్యాన్నేలే మహా రాజు చనిపోబోతున్నాడు" అన్నది.

ఆ మాట వినగానే ఆ మూడవ కుమారుడు రాజ భవనంలోకి పరుగుతీసి, రాజుగారి అంత:పురంలోనికి ప్రవేశించాడు. అక్కడ, రాజుగారి మంచాన్ని చుట్టుకొని ఉన్నది- ఒక పెద్ద పాము! అది రాజుగారిని మింగేయడానికి చూస్తున్నది! రాజకుమారుడు వెంటనే కత్తి తీసి దానితో పోరాడి, దాన్ని చంపేశాడు. ఆ పామును నూరు ముక్కలుగా చేసి, ఒక బంగారు పళ్ళెంలో ఉంచాడు.

అలా అతను పామును చంపేసేటప్పుడు, ఒక రక్తపు చుక్క అక్కడే పడుకొని ఉన్న అతని పినతల్లి చేతిమీద పడింది. అతను వంగి దాన్ని తుడుస్తుండగా పినతల్లి మేల్కొని, గట్టిగా అరిచి రాజును, కాపలాదారులను నిద్రలేపింది.

"నువ్వు ఇంత అర్ధరాత్రి వేళ నా గదిలోకి ఎందుకు వచ్చావు? నీ పినతల్లిని, నన్ను చంపడానికి వచ్చావు కదూ?" అని, రాజుగారు భటులను పిలిచి యువరాజును బంధించమన్నారు. ఆ క్షణమే అతనికి ఆయన శిరచ్ఛేద శిక్ష విధించి, వెంటనే అమలు జరపమన్నారు.

భటులు రాజాజ్ఞను అమలు జరపక తప్పదు. వాళ్ళు యువరాజును

తీసుకొనిపోయి శిరచ్ఛేదానికి అన్ని ఏర్పాట్లూ పూర్తి చేసారు. చివరగా వాళ్ళు యువరాజును "నీ చివరికోరిక ఏమిటో తెలిపితే, తీరుస్తాం" అన్నారు. "మా నాన్నగారు, పినతల్లి గారు నేను చెప్పబోయే మూడు కథలూ వినాలి- అదే నా చివరి కోరిక" అన్నాడు రాజకుమారుడు.

రాజుగారికి అది ఏమాత్రం ఇష్టం లేదు- తనను హత్య చేయబోయిన కొడుకు ముఖం చూడటానికి కూడా ఆయనకు ఇష్టం కాలేదు- కానీ ఏంచేయాలి? ఎవరిదైనా సరే, చివరికోరికను తీర్చవలసిందే- అందుకని రాజుగారు తన భార్యలతో సహా బయలుదేరి వచ్చారు. అప్పుడు రాజకుమారుడు మూడు కథలు చెప్పాడు:

**<u>"ఒకటో కథ:</u>**

అనగనగా ఒక రాజ్యం ఉండేది. ఆ రాజు వేటకోసం అడవికి వెళ్ళాడు. రాజ్యం నుండి చాలా దూరంగా- గుర్రం మీద పోతూ, దారి మధ్యలో ఒక చెట్టు కింద కూర్చున్నాడు. బాగా దప్పిక వేసింది. తను తెచ్చుకున్న కుండలోని నీటిని తాగుదామని బయటకు తీసాడు. దాన్ని తీసీ తీయగానే అతని గుర్రం సకిలించింది- కట్టు త్రాళ్ళను తెంచుకొని పరుగెత్తి వచ్చింది. ఆ కుండను తన్నింది. కుండ క్రిందపడి పగిలిపోయింది. నీళ్లలో చాలా భాగం నేలపాలయ్యాయి. దప్పిక గొని ఉన్న రాజుకు చాలా కోపం వచ్చింది.



తక్షణం కత్తి తీసి గుర్రాన్ని చంపేశాడు. అంతలో అక్కడ తిరుగాడుతున్న కుక్క ఒకటి వచ్చిందక్కడికి. పగిలిన కుండలో మిగిలిన కొన్ని నీళ్లనూ అది తాగేసింది. త్రాగీ త్రాగగానే ఆ కుక్క నురగలు కక్కుకుంటూ చనిపోయింది!

అప్పుడు అర్థం అయ్యింది రాజుకు: తన శత్రువులెవరో తను తీసుకొచ్చిన కూజాలో విషం కలిపారు. ఆ సంగతి తెలుసుకున్న గుర్రం తనను కాపాడబోయింది! అని. అయినా అప్పటికే జరగవలసిన నష్టం జరిగిపోయింది. విశ్వాస పాత్రమైన గుర్రం చనిపోయింది. ఏ పనినీ అనాలోచితంగా చేయకూడదు.

**రెండో కథ:**

అనగనగా రాజవర్మ అనే రాజు దగ్గర ఒక చిలక ఉండేది. రాజుకు ఆ చిలక అంటే చాలా ఇష్టం. ఒకసారి చిలక తన తల్లిదండ్రులను చూసేందుకని, రాజుగారిని పది రోజులు శలవడిగి, ఇంటికి వెళ్ళింది. పది రోజులూ గడిచిన తర్వాత, తిరిగి వచ్చేటప్పుడు అది ఎంతో కష్టపడి, అడవుల నుంచి ఒక దివ్యమైన ఫలాన్ని తీసుకు వచ్చింది. ఆ పండుకు కొన్ని గాట్లు, గీతలు పడి ఉన్నై, కొంచెం దెబ్బ తిన్నట్లుగా కూడా ఉంది, అది. రాజు మీద ప్రేమ గల చిలుక ఆ సంగతిని అస్సలు పట్టించు-కోలేదు. ఆ పండును తీసుకెళ్ళి, అది నేరుగా రాజుగారికి ఇచ్చింది. "ఈ చిలుక నా మీద ఎంతో ప్రేమతో ఈ పండును తెచ్చింది" అని సంబరపడి, రాజు ఆ పండును తినబోతున్నాడు-

అంతలో మంత్రి వచ్చి ఆపాడు ఆయనను- "రాజా! "ఈ పండును ఏదో జంతువు కొరికినట్లున్నది చూడండి- ఈ ప్రక్కన గాట్లు పడి ఉన్నాయి. ఎక్కడో, ఏ జంతువో కొరికి క్రింద పడేసిన పండును తీసుకువచ్చి, మీకు ఎంతో ప్రేమతో అపురూపంగా ఇచ్చినట్లు ఇస్తున్నది ఈ చిలుక. ఇది విషపూరితమని నాకు అనిపిస్తున్నది" అని.

ఈమాట వినగానే రాజు కు విపరీతమైన కోపం వచ్చింది. ఖడ్గమెత్తి, తనను హత్య చేయబూనిన ఆ చిలుకను ఒక్క వ్రేటున చంపేశాడు. అది తెచ్చిన ఆ పండును కోట అవతలికి విసిరేశాడు. బయట పోతున్న ఒక కుష్టు రోగికి దొరికింది, ఆ దివ్యఫలం. అతను ఆ పండును తిన్న వెంటనే అతని రోగం మాయమవ్వటమే కాక, అతను అత్యంత

సౌందర్య వంతుడయ్యాడు. మరునాడు అతను వచ్చి, ధన్యవాదాలు చెప్పుకున్నప్పుడు- గానీ రాజుకు తను చేసిన తప్పిదం తెలిసి రాలేదు. అప్పటికే జరగవలసిన నష్టం జరిగిపోయింది- చిలుక చనిపోయింది. కోపం కొద్దీ ప్రవర్తించేముందు, అవతలివాళ్ళు చెప్పేది పూర్తిగా వినాలి.



## మూడో కథ:

ఒక రోజున ఒక రైతుకు అడవిలో ఒక చిన్నారి ముంగిస దొరికింది. అతనికి దాన్ని చూస్తే జాలి వేసింది. దాన్ని పెంచుకొని, ఉన్నన్ని రోజులు సాకుదామనుకున్నాడు. ఆ ముంగిస పిల్లను ఇంటికి తీసుకొని వచ్చాడు.

ఇంట్లో రైతుకొక చంటిబిడ్డ ఉన్నాడు. ఆ చంటిబిడ్డ ముంగిస పిల్లను చూసి చాలా సంతోషించాడు. ముచ్చట పడ్డాడు. కాని వాళ్ళ అమ్మ మాత్రం సంతోషించలేదు. ఆ ముంగిస తన బిడ్డను ఎక్కడ కరుస్తుందోనని ఆమె భయపడింది. రోజులు గడిచి పోయాయి- ముంగిస పెరిగి పెద్దదయింది. పిల్లవాడితో ఆడుకోవడం దానికి చాలా సరదాగా ఉండేది. పిల్లవాడికీ దానితో ఆడుకోవటం చాలా ఇష్టంగా ఉండేది.

ఒకనాడు రైతు భార్య అంగడికి వెళ్ళవలసి వచ్చింది. ఆమె పిల్లవాడిని ఊయలలో పడుకోబెట్టి, జాగ్రత్తగా చూస్తుండమని భర్తతో చెప్పి, వెళ్లింది. ఊయల ప్రక్కనే కూర్చొని ఊపసాగాడు రైతు. త్వరలోనే పిల్లవాడు నిద్రలోకి జారుకున్నాడు. ఊయల దగ్గరే నేల మీద కూర్చొని ఉంది, ముంగిస. పిల్లవాడు నిద్రపోయాడని గమనించిన రైతు తోటకు

వెళ్ళిపోయాడు.

కొంతసేపటికి రైతు భార్య ఇంటికి తిరిగి వచ్చింది- గంప నిండా కూరగాయలు మోసుకొని. ఇంటి వాకిట్లోనే ముంగిస ఆమె కోసం ఎదురు చూస్తూ ఉన్నది: దాని ముఖం నిండా రక్తపు మరకలు ఉన్నాయి!



రైతు భార్యకు గుండె పగిలినట్లైంది. ఆమె ఏనాడూ ఈ ముంగిసను నమ్మలేదు. అది తన పిల్లవాడిని చంపి తిన్నదనిపించింది ఆమెకు. తిన్నదే కాక, తనకు ఆ సంగతిని చెప్పటం కోసం ఇంటి వాకిట నిల్చున్న ముంగిసను ఆమె క్షమించలేకపోయింది. చేతనున్న బరువైన గంపను ఎత్తి, బలంగా ముంగిస పైకి విసిరింది. ఆ దెబ్బకు నలిగి చచ్చిపోయింది ముంగిస. ఆ వెంటనే ఆమె ఇంటి లోనికి పరిగెత్తింది. లోపల పిల్లవాడు కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నాడు. తనను ఎత్తుకొమ్మని తల్లివైపు చేతులు చాస్తున్నాడు. ఉయ్యాలకు దగ్గర్లో పాము ఒకటి చచ్చి పడి ఉన్నది. పిల్లవాడిని రక్షించటం కోసం ముంగిస చంపింది, ఆ పామును! విషయం తెలుసుకున్న రైతుభార్యకు ముంగిస పట్ల కృతజ్ఞతతో కళ్ళు చెమర్చాయి. కానీ అప్పటికే జరగ వలసిన నష్టం జరిగిపోయింది- ప్రేమించిన ముంగిస చనిపోయింది. శిక్ష విధించే ముందు, ఏం జరిగిందో తప్పక తెలుసుకోవాలి."

మూడు కథలూ విన్న రాజుకు తన తొందరపాటు అర్థమైంది. అసలు జరిగిన సంగతి ఏంటో చెప్పమని అడిగాడు కొడుకును. జరిగిన విషయాన్ని, ఆధారాలతో సహా తెలుసుకున్నాక, ఆయనకు నిజంగా

కనువిప్పైంది. తన తప్పిదానికి ఎంతో సిగ్గు పడ్డాడు రాజు.

ఆ నాటినుండి ఆ రాజ్యంలో 'మరణ శిక్ష' అన్నదే పూర్తిగా రద్దైంది. 'ఎవరికైనా, తమ నిర్దోషిత్వాన్ని నిరూపించుకునేందుకు పూర్తి అవకాశం ఉండాలి' అని కొత్త శాసనం తయారైంది.

జోకు

## మెదడు పని

*సేకరణ:డి..అనిష్ , 5వతరగతి, విజ్ఞం స్కూల్.*

ఒక ఇంట్లో భార్య,భర్త ఉంటారు. భార్యపేరు మెదడు, భర్తపేరు ఏంటి. వీళ్లింటికి ఒక రోజున బంధువులు వస్తారు.

బంధువులు: నీపేరు ఏంటి?

భర్త: నాపేరు ఏంటి.

బంధువులు (ఇంకొకసారి): నీపేరు ఏంటి?

భర్త(నిజాయితీగా ): నాపేరు ఏంటి .

బంధువులు(కోపంగా): నీకేమైంది? మెదడు పనిచేయడంలేదా?

భర్త: మెదడు లోపల వంట చేస్తున్నది. పిలవమంటారా?

బంధువులు: ఆ...?!




# రామలింగని యుక్తి



*సేకరణ: కె. గంగమ్మ,ఉపాధ్యాయురాలు, టింబక్టు బడి.*

చలికాలంలో ఒక రోజున రాయలవారికి అనుకోకుండా ఒక చిలిపి ఆలోచన వచ్చింది. వెంటనే ఆయన దాన్ని అమలు చేశారు కూడా: "శీతాకాలం కదా ఇప్పుడు, గడగడ వణికించే ఈ చలిలో- మెడలోతు నీళ్లలో మునిగి, రాత్రంతా ఎవరైతే జాగరణ చేస్తారో, వాళ్లకు పది వరహాలు బహుమతినిస్తాం" అని చాటింపు వేయించారు.

ఈ వార్త విన్నాడు ఒక పేదవాడు- "ఒక్క రాత్రికి ఓర్చుకుంటే పది వరహాలు వస్తాయి. పొలంలో పంట పెట్టుకోవడానికి ఈ ఏడాదికి కావలసిన పెట్టుబడి దొరికినట్లవుతుంది" అనుకొని, వాడు శ్రమకోర్చి నగరానికి నడిచిపోయాడు. నిండు సభలో వాడు రాజుగారిని కలిసి, తాను పందెంలో పాల్గొంటున్నట్లు తెలియజేసాడు.

ఆ సరికే రాజోద్యోగులు, నగర పౌరులు, పురోహితులు అనేకమంది ఆ పనికి పూనుకొని ఉన్నారు. అంత చల్లటి నీళ్లలో రాత్రంతా గడపటం వాళ్ళెవ్వరికీ చేతకాలేదు. అందరూ మధ్యలోనే విరమించి ఉన్నారు. అందుకని సభలో ఉన్న పండితులు ఈ పేద రైతును చూసి ఎగతాళిగా నవ్వారు. రాయల వారుకూడా నవ్వుతూ "ఇంత బక్క చిక్కిన నువ్వేంటి, గడగడ వణికించే ఈ చలిలో- అదీ నీళ్లలో మునిగి- జాగరణ చేయటమేమిటి?" అని నిరాశపరచారు.

కానీ రైతు పేదరికం అతని పట్టుదలను మరింత దృఢపరచింది. ఎవరు ఏమన్నా అతను తన పట్టు వీడలేదు. నీళ్లలో ఉంటానంటే ఉంటానన్నాడు. అనటమే కాదు- రక్తాన్ని గడ్డ కట్టించే ఆ చలిలో- రాత్రంతా మెడలోతు నీళ్ళలో మునిగి నిలబడ్డాడు. అనుకున్న పనిని పూర్తిచేసి, తెల్లవారుతుండగా తడి బట్టలతోనే రాజ ప్రాసాదానికి వచ్చాడు.

రాయలవారు అతనిని ఒక గదిలో కూర్చుండబెట్టి, తన సహచరులతో చర్చించారు. "ఈ రైతు చెబుతున్నది వాస్తవమేనా? రాత్రంతా చలిలో, చీకటిలో, మెడలోతు నీళ్ళలోమునిగి ఉన్నాడా, నిజంగానే?" అని అడిగారు వాళ్ళను.

అక్కడ ఉన్న పండితులందరికీ రైతు నిజంగానే మాట దక్కించుకున్నాడని తెలుసు. అయినా తమకు రావలసిన ఖ్యాతి ఎవరో అనామకుడికి దక్కటం వాళ్ళకు ఇష్టం కాలేదు. వాళ్ళు రాయలవారితో "ఇందులో ఏదో మోసం ఉంది మహారాజా!" అన్నారు. రాయలవారు చెరువుకు కాపలాగా ఉంచిన భటుడొకడిని పిలిపించి అడిగారు వాళ్ళు. వాడు పండితుల ఆంతర్యాన్ని అర్థం చేసుకొని- "చెరువు ఒడ్డునే తమరి అంత:పురం ఉన్నది గదా మహారాజా, నిన్న ఆ అంత:పురంలో ఒక కాగడా వెలుగుతూ ఉండింది. ఆ కాగడానుండి వెలువడ్డ వెచ్చదనం చెరువునిండా పరచుకొని ఉన్నది. ఆ వేడిని గ్రహిస్తూ రాత్రంతా గడిపాడు ఈ రైతు- లేకపోతే ఇంత చలిని తట్టుకునేంత శక్తి

ఎక్కడిది, ఈ బక్క ప్రాణికి?" అన్నాడు.

ఈ చెప్పుడు మాటలు విన్నారు రాయలవారు. వెంటనే ఇక ఏమీ ఆలోచించకుండా రైతుకు ఇవ్వవలసిన బహుమానాన్ని రద్దు చేశారు. పదివరహాలమీద ఆశ పెట్టుకున్న ఆ పేదరైతుకు పాపం గుండె పగిలినట్లైంది. అయినా చేసేదేమీ లేక, దు:ఖాన్ని దిగ మ్రింగుకొని అతను ఇంటి దారి పట్టాడు.

ఇదంతా గమనిస్తూ కూర్చున్నాడు రామలింగకవి. ఈ అన్యాయాన్ని సహించ-కూడదనుకున్నాడు. వెంటనే తన మనిషిని ఒకడిని పిలిచి, నిరాశగా పోతున్న రైతు వెంట పొమ్మన్నాడు. ఆ రైతును సగౌరవంగా తన ఇంటికి తీసుకెళ్ళి ఉంచమన్నాడు.

ఆపైన సభలో లేచి నిలబడి, రాజుగారిని, తోటి కవులను, పండితులను, రాజోద్యోగులను అందరినీ ఆరోజు సాయంత్రం తన ఇంట్లో జరుపనున్న విందుకు ఆహ్వానించాడు. ఇంటి తోటలో విందు. ఆ విందులో ఏమేమి వంటకాలు ఉండబోతు-న్నాయో ముందుగానే అందరికీ నోరూరేటట్లు వివరించాడు రామలింగడు.

"రామలింగడు రమ్మనటమేమిటి, తాము వెళ్ళకపోవటమేమిటి?" అని, అందరూ ఆ రోజు సాయంత్రం పరగడుపులతోటే విందుకు హాజరయ్యారు- ఎక్కువెక్కువగా మెక్కి తినేందుకు సిద్ధంగా వచ్చారు. రాయలవారుకూడా విచ్చేశారు- వికటకవి ఇంట విందు ఎలా ఉంటుందోచూద్దామని. రామలింగడు అందరినీ తోటంతా తిప్పుతూ కాలక్షేపం చేశాడు తప్పిస్తే, వచ్చిన వాళ్లకు పచ్చి మంచినీళ్ళు కూడా ఇవ్వలేదు.

రాత్రి బాగా చీకటిపడింది. అందరికీ కడుపులు మాడుతున్నాయి. పైపెచ్చు చలి. విందు ఏర్పాట్లు మాత్రం ఎక్కడా మచ్చుకైనా కనబడటం లేదు. కనీసం వంటకాల వాసనకూడా దరిదాపుల్లో లేదు.

భోజన సమయం దాటిపోయింది. రాయల వారి కోపం తారస్థాయికి చేరుకున్నది.

ఇక తట్టుకోలేక ఆయన- "కవిగారూ! విందు ఎక్కడ?" అని అడిగారు. రామలింగడు "ఇదిగో , మహారాజా ! వంట అవుతున్నది- కొంచెం ఓపిక పట్టండి- త్వరలోనే అయిపోతుంది" అన్నాడు.

"ఏదీ, కనబడదేం? కనీసం వాసనలన్నా రావటం లేదు! ఎక్కడ వండుతున్నారో చూపించు, అసలు?" అన్నారు రాయలవారు.

రామలింగడు తోటలోనే ఒకమూలకు తీసుకువెళ్ళాడు అందరినీ- "చూడండి మహారాజా! పైన చెట్టుకు తీగలతో గంగాళాన్ని కట్టి పెట్టాను. క్రింద కొత్త క్రొవ్వొత్తిని ఒకదాన్ని వెలిగించి పెట్టాను, చూడండి. ఈ వేడికి ఎసరు కాగటమే తరువాయి. ఒకసారి ఎసరు కాగిందంటే బియ్యం ఇట్టే ఉడికిపోతుంది" అన్నాడు రామలింగడు తాపీగా.

"అయ్యో! రామలింగా, నీకేమయినా బుద్ధుందా, ఎప్పటికి వేడి తగిలేది, ఎప్పుడు ఎసరు కాగేది, ఎప్పటికి అన్నం ఉడికేది, ఇక ఎప్పుడు విందు ఆరగించేది? మాతోటే పరాచకాలా? మమ్మల్ని ఇంతగా అవమాన పరుస్తావా? ఈసారి నీకు దండన తప్పదు" గర్జించారు రాయలవారు.

అప్పుడు రామలింగడు- "క్షమించండి మహారాజా! కొలనులో మునిగి ఉన్న మనిషి కోటలో ఎక్కడో ఉన్న కాగడాతో చలిని కాచుకొన్నప్పుడు, ఇంత దగ్గరగా పెట్టిన క్రొవ్వొత్తి వేడికి అన్నం ఉడకదంటారా? ఏలినవారు మన్నించాలి" అన్నాడు అనునయంగా.

రామలింగని మాటల అంతర్యాన్ని గ్రహించిన రాయలవారు సిగ్గుపడ్డారు. తన మెడలోని ముత్యాల హారంతో రామలింగ కవి మెడను అలకరించారు.

"నా మెడ ఏలిన వారి ముత్యాల హారపు బరువుకు సంతోషంగా వంగిపోతున్నది. మరి ఈపేద రైతు కడుపుకూ తమరే రక్షణ కల్పించాలి" అని రైతును రాయలవారి ముందు నిలిపాడు రామలింగడు. రాయలవారు నవ్వి, సభికుల హర్షధ్వానాల మధ్య, పందెం

గెల్చినందుకు పది వరహాలు, అపరాధ క్షమాపణగా వంద వరహాలు బహూకరించి రైతును సత్కరించారు.

రామలింగ కవిని పొగుడుతూ రైతు సంతోషంగా ఇల్లు చేరుకున్నాడు.

జోకులు

## నాయకుల గోల

*సేకరణ: టి.యస్.కిషోర్, ఆరవ తరగతి, విజ్ఞం స్కూల్.*

ముగ్గురు నాయకులు కార్లో పోతూ ఇలా మాట్లాడుకుంటూ వెళుతున్నారు.

**మొదటి నాయకుడు:** నేను చిటికేస్తే, నా ముందర వెయ్యి మంది వచ్చి పడతారు.

**రెండవ నాయకుడు:** నేను చిటికేస్తే, నా ముందర రెండు వేల మంది వచ్చి పడతారు.

**మూడవ నాయకుడు**: ఓస్ మీకంతే కదా! నేను చిటికేస్తే నాముందర పదివేల మంది పడతారు.

**కారు డ్రైవరు:** ఒకవేళ నేను ఒక బ్రేకు వేస్తే, నా ముందు మీ ముగ్గురూ వచ్చి పడతారు.

## కొత్త నాన్న

(ఒకసారి రైల్లో అమ్మ, నాన్న, కొడుకు ప్రయాణం చేస్తున్నారు.కొడుకు కిటికీ దగ్గర కూర్చుని పుస్తకం చదువుతుండగా పుస్తకం కింద పడిపోతుంది.)

**కొడుకు**:అమ్మా, అమ్మా పుస్తకం కింద పడిపోయింది.

**అమ్మ:** పోతే పోనీలేరా! దిగిన తర్వాత కొత్త పుస్తకం కొనుక్కుందాము.

(కొద్దిసేపటి తర్వాత)

**అమ్మ(గాభరాగా):** ఒరేయ్ బాబూ! మీ నాన్న కింద పడి పోయాడురా!

**కొడుకు(తాపీగా):** పరవాలేదులేమ్మా! దిగినతర్వాత కొత్త నాన్నను కొనుక్కుందాం గానీ!




# ఒక చిన్న సాయం

*రచన: బయ్యవరపు హరనాథ్, భౌతికశాస్త్ర అధ్యాపకులు, హైదరాబాదు.*

ఆదివారం కావటంవలన పార్కు అంతా చాలా సందడిగా ఉంది, పిల్లలందరూ చాలా ఉత్సాహంగా ఆడుకుంటున్నారు.

"పూజా...తమ్ముణ్ణి చూస్తూఉండు- పరిగెత్తకుండా, నెమ్మదిగా ఆడుకోండి.." కొద్దిగా దూరంగా ఉన్న సిమెంటు బెంచ్ పై కూర్చొని, పిల్లల ఆటల్ని గమనిస్తూ చెప్పింది పూజా వాళ్ళ అమ్మ. వాళ్ళ నాన్నగారుకూడా అక్కడే కూర్చొని ఉన్నారు.

"అలాగే మమ్మీ..." అని, మళ్ళీ తమ్ముడు బబ్లుతోపాటు ఆటలో మునిగింది పూజ.

చల్లని సాయంత్రం..గాలి ఎంతో ఆహ్లాదకరంగా ఉంది. పిల్లల ఆనందాన్ని

ప్రతిబింబిస్తూ మెల్లగా ఊగుతున్నాయి పూల కొమ్మలు. పూజ-బబ్లు ఇద్దరూ తాము తెచ్చుకున్న బంతితో ఫుట్ బాల్ ఆడుతున్నారు.

బబ్లు బంతిని గట్టిగా తన్నేసరికి, అది పోయి దూరంగా కూర్చొని ఉన్న బిచ్చగాడి ముందు పడింది. వాడి ముందు ఉన్న సత్తు పళ్లెం బంతి తాకిడికి దబ్బుమన్నది. ఆ పళ్లెంలో రూపాయి నాణాలు రెండు, రెండు రూపాయిల బిళ్ళ ఒకటి- మొత్తం మూడు రూపాయలు ఉన్నాయి.

బిచ్చగాడికి ఏమంత వయసు లేదు- పది, పన్నెండు సంవత్సరాల మధ్య ఉంటుందేమో. వాడు వేసుకున్న నిక్కరు పూర్తిగా మాసిపోయి ఉంది. ఒకకాలు చాపుకొని ఉన్నాడు- రెండో కాలుకు మోకాలి క్రింది భాగం ఖాళీగా ఉంది. లేచి బంతిని అందించే పరిస్థితిలో లేడు వాడు. అయినా విరిగిన తన కాలుకు ప్రత్యామ్నాయంగా వాడుతున్న కర్రతోటే బంతిని పూజ వైపుకు నెట్టాడు. ఆ క్షణంలో వాడి మొహంలో చిన్న ఆనందం మెరుపులా వచ్చి మాయంఅయ్యింది- బహుశ: 'నేను కూడా బంతిని కొట్టాను' అన్న సంతోషమేమో అది.

బంతిని అందుకొని, వాడివైపు ఒకసారి చూసింది పూజ. వంటి పైన చొక్కాలేదు, కడుపు నిండా తిని చాలా రోజులు అయినట్లు చెప్పకనే చెబుతున్నది అతని కడుపు. మళ్ళీ తమ్ముడితో ఆడుకోవటానికి వచ్చేసింది పూజ.

"ఐస్...ఐస్..." అక్కడున్న పిల్లల దృష్టిని తన బండిపైకి మరలించేందుకు గట్టిగా అరుస్తున్నాడు బండివాడు. "ఐస్...ఐస్..." మరోసారి గట్టిగా అరిచాడు. వాడి ప్రయత్నం ఫలించింది.

"ఐస్ ..కొనుక్కుందామా.. అక్కా....?!" బండివాడి వైపు చూస్తూ అడిగాడు బబ్లు

"డాడీని అడుగుదాం..పద.." అంటూ కొద్దిగా దూరంగా కూర్చుని ఉన్న అమ్మ-నాన్నల దగ్గరికి వెళ్ళారు పూజా, బబ్లూ.

"డాడీ.. ఐస్...కొనుక్కుంటాం..."

అడిగాడు బబ్లు, వాళ్ళ నాన్నని.

"వద్దు జలుబు చేస్తుంది..." వారించింది వాళ్ళ అమ్మ.

"ఎప్పుడో ఒక్కసారే కదా..... కొనుక్కోనీ!" అంటూ పది రూపాయలునోటు తీసి బబ్లూకి ఇచ్చాడు వాళ్ళ నాన్న. "నువ్వుకూడా కొనుక్కో..." అంటూ మరొక పదిరూపాయల నోటు తీసి పూజకు ఇచ్చాడు.

"థాంక్యూ..డాడీ..." అని చెప్పి, ఇద్దరూ పరుగెత్తుకుంటూ ఐస్ బండివాడి దగ్గరికి వెళ్ళారు. అప్పటికే ఇంకా కొంతమంది పిల్లలు- చేతిలో పదిరూపాయల నోట్లతో- అక్కడ వాలిపోయిఉన్నారు.

"ఐస్ ఎంత!?" అడిగింది పూజ.

"కప్ ఐస్ ఎనిమిది రూపాయలు, చాక్లెట్ ఐస్ పదిరూపాయలు" అని చెప్పి, మళ్లీ "ఐస్...ఐస్....." అంటూ గట్టిగా అరిచాడు బండివాడు.

ఒక నిమిషం ఆలోచించి "నాకు ఒక కప్ ఐస్ ఇవ్వు..." అంటూ పదిరూపాయలనోటు అందించింది పూజ.

"పది రూపాయలు ఉన్నాయిగా, చాక్లెట్ ఐస్ కొనుక్కుందాం! అది ఇంకా బాగుంటుంది!" చెప్పాడు బబ్లు.

"నాకు వద్దు- కావాలంటే నువ్వు కొనుక్కో" నవ్వుతూనే చెప్పింది పూజ. "మిగిలిన రెండు రూపాయలూ ఏమిచేస్తావ్..?!" అనుమానంగా అడిగాడు బబ్లు ఏం సమాధానం చెబుతుందోనని ఆసక్తిగా చూస్తున్నాడు బండివాడు.

అక్కడకు కొద్ది దూరంలో కూర్చొని ఉన్న బిచ్చగాణ్ణి చూపిస్తూ- "అతనికి ఇస్తాను- పాపం వాణ్ణి చూస్తుంటే- ఐస్ కాదుకదా, కనీసం అన్నంకూడా సరిగా తింటున్నట్లు లేదు. మన దగ్గర ఉన్న మొత్తం కాకపోయినా, మన అవసరాలకు సరిపోను ఉంచుకొని, మిగిలినదానితో లేనివారికి సహాయం చేయమని మా టీచర్ చెప్పారు. అందుకే ఆ రెండు రూపాయలూ అతనికి ఇస్తాను- ఏదో

ఒక చిన్న సాయం..." అన్నది పూజ.

బబ్లుతో పాటు అక్కడ ఉన్నపిల్లలు, బండివాడు కూడా ఆసక్తిగా వింటున్నారు. బబ్లుకి ఏదోకాస్త అర్థం అయినట్లుంది.

"నాకు కూడా కప్ ఐస్ ఇవ్వు!" అంటూ బండివాడికి పదిరూపాయలనోటు అందించాడు బబ్లు. "నేను కూడా రెండు రూపాయలు అతనికి ఇస్తాను" అని అక్కతో చెబుతూ.

అక్కడే ఉండి, పూజ చెప్పింది విన్న ఆ పిల్లలందరూ "మాకు కూడా కప్ ఐస్ ఇవ్వు!" అని అడిగారు బండివాడిని. పూజవైపు చూస్తూ "మేము కూడా రెండు రూపాయలు అతనికి ఇస్తాం!" అని చెప్పారు.

అందరూ వెళ్ళి, తమవద్ద మిగిలిన రెండురూపాయల్ని బిచ్చగాడి పళ్ళెంలో వేశారు. త్వరలోనే వాడి పళ్ళెం రెండు రూపాయల బిళ్ళలతోటీ, వాడి మనసు ఆనందంతోటీ నిండిపోయాయి.

ఐస్ బండివాడు కూడా వచ్చి, ఒక ఐస్ ను బిచ్చగాడికి ఇస్తూ- "తీసుకో! డబ్బులు ఏమీ వద్దులే!" అన్నాడు. ఆ క్షణంలో రెండుకన్నీటి బొట్లు వాడి చెంపలపైనుండి మెల్లగా క్రిందికి జారాయి.




# అధ్యయనం

*మూలం: పర్తాప్ అగర్వాల్.*

*తెలుగు అనుసరణ: నారాయణ, కొత్తపల్లి బృందం.*



పవిత్రమైన న్యాయం ఒకటుందని నమ్ముతారు యూదు మతస్తులు. వాళ్ళ గురువులను 'రబ్బీలు' అంటారు. వాళ్ళు ఆ ధర్మాన్ని అధ్యయనం చేస్తుంటారు.

ఒకసారి రోమన్ దేశీయుడొకడు వచ్చాడు- యూదుల గురువు 'గింజో' దగ్గరికి: "మీ యూదులంతా ఏదో న్యాయం గురించి చదువుతారట గదా, ఏంటది?" అని అడిగాడు.

"దాన్ని వివరించటం చాలా కష్టం. అయినా ప్రయత్నిస్తాను. జాగ్రత్తగా విను- శ్రద్ధగా, మనసు పెట్టి వినాలి మరి. ఇద్దరు మనుషులు ఒక ఇంటి పై కప్పు మీదికి ఎక్కి, అక్కడున్న పొగ గొట్టంలోంచి క్రిందికి జారారు. ఒకడి ముఖం మసిబారింది. రెండోవాడి

ముఖానికి మసి లేదు. మరి నువ్వు చెప్పు- ఎవరు ముఖం కడుక్కున్నారు?" అన్నాడు గింజో.

"చెప్పేందుకు ఏమున్నది? శుభ్రంగా ఉన్నవాడు ముఖం కడుక్కున్నట్టు, అంతే గదా?" అన్నాడురోమన్.

"లేదు. నువ్వు చెప్పింది తప్పు. శుభ్రంగా ఉన్నవాడు ముఖం ఎందుకు కడుక్కోవాలి? ఇద్దరూ పొగ గొట్టంలోంచి జారి వచ్చారు. వచ్చాక , ఒకడు తన స్నేహితుడి ముఖం కేసి చూశాడు: అది మసిబారి ఉన్నది. దాన్ని చూసేసరికి, వాడికి 'తన ముఖానికీ మసి ఉన్నదేమో, అనిపించింది..."

"ఒహో ! అష్లా! మీరు ధర్మశాస్త్రం ఎందుకు చదువుతారో అర్థమైంది. మీకు మంచి 'తార్కిక శక్తి' లభించాలని ! అవునా ?" అన్నాడు రోమను, ఉత్సాహంగా.

"లేదు, నీకు సరిగ్గా అర్థం కాలేదు, వెర్రివాడిలా మాట్లాడకు . మళ్ళీ చెబుతాను, జాగ్రత్తగావిను- "ఇద్దరు వ్యక్తులు పొగగొట్టంలోంచి కిందకు జారారు. ఒకడి ముఖానికి మసి అంటి ఉన్నది. రెండో వాడి ముఖానికి లేదు. ఎవరు ముఖం కడుక్కుంటారు ?" అడిగాడు రబ్బీ గింజో.

"మీరన్నట్లు, ముఖానికి మసి అంటని వాడు ముఖం కడుక్కున్నాడు. తన స్నేహితుడి ముఖానికి మసి అంటి ఉండడం చూశాడు అతను. తన ముఖం కూడా మసిబారి ఉందనుకున్నాడు. అందుకని వెళ్ళి ముఖం కడుక్కున్నాడు- సరిగ్గా ఉంది, ఇది."

గింజో అన్నాడు- " లేదు, పిచ్చివాడా! అలాకాదు. గదిలో ఒక అద్దం ఉంది. ముఖం కడుక్కున్నవాడు ఆ అద్దంలో తన ముఖం చూసుకున్నాడు" అని.

"ఓహో! మీ ధర్మశాస్త్ర అధ్యయనం అదన్నమాట ! వేరే విధంగా చెప్పాలంటే, 'తార్కికత'ను మీరు సమర్థిస్తారన్నమాట!" అన్నాడు రోమను.

"అయ్యో, వెర్రాయనా, నీకు ఇంకా అర్థం కాలేదు. ఇద్దరు మనుషులు ఇంటి పైకప్పును ఎక్కి, పొగ గొట్టంలోంచి క్రిందకు జారారు. ఒకడి ముఖానికి మసి అంటింది; ఇంకొకడి ముఖానికి అస్సలు ఏమీ అంటలేదు- కానీ ఇది అసాధ్యం! అట్లా ఎట్లా కుదురుతుంది? పో, ఇలాంటి పిచ్చి ఊహలతో సమయం వృధాచేయకు" అన్నాడు గింజో.

"ఓహో! అదేనన్న మాట, ధర్మం అదేనా? చాలా స్పష్టం- కనీస మాత్రంగా ఉండాల్సిన జ్ఞానం, ఇది- 'కళ్ళముందు కనబడే దాన్ని చూడాలి '-అని". అన్నాడు రోమను కొంచెం సిగ్గు పడుతూ.

"అయ్యో, వెర్రివాడా, ఒకడి ముఖానికి మసి అంటి, రెండోవాడి ముఖానికి ఏమీ అంటకపోవటం అసాధ్యమెందుకు అవుతుంది? సుసాధ్యమే. చూడు, ముందుగా ఒకడు పొగగొట్టంలోంచి క్రిందికి జారుతున్నప్పుడు, దానిలోని మసి మొత్తం అతనికి అంటింది. అందుకని, వాడి తర్వాత జారిన రెండోవాడి ముఖానికి మసి అంటలేదు" అన్నాడు గింజో.

"ఇది అద్భుతంగా ఉంది. నాకు అర్థమైంది, రబ్బీ గింజో. ధర్మం అంటే 'మౌలికమైన వాస్తవాలను చేరుకోవటం' -కదూ?"

"లేదు, లేదు. పిచ్చివాడిలా మాట్లాడకు- అట్లా అవ్వదు. ఎందుకంటే, పొగగొట్టంలో ఉన్న మసి మొత్తాన్నీ ఒక్కసారిగా ఎవరు ఊడ్చివేయగలరు? అది అసాధ్యం" అన్నాడు గింజో.

"మరయితే మీరు ఎడతెరపి లేకుండా చదివే ధర్మం ఏంటి? దయచేసి చెప్పండి నాకు" అన్నాడు రోమను, ప్రాధేయపడుతున్నట్లు.

"'మనం చూసే అతి చిన్న విషయాల వెనుక ఉన్న వాస్తవాల్నీ కూడా మనం పూర్తిగా అర్థం చేసుకోలేము' అని తెలుసుకోవటమే ధర్మాన్ని అధ్యయనం చేయటం అంటే. 'మనం అన్నింటినీ తెలుసుకోలేము' అని

తెలుసుకోవటమే ధర్మాధ్యయనం. మనం ఆ భగవంతుని ఉద్దేశ్యం ఏమిటో తెలుసుకునేందుకు మనకు చేతనైన ప్రయత్నం చేయవచ్చు, కానీ సర్వమూ తెలిసినవాడూ, తెలుసుకోగల వాడూ ఆ భగవంతుడొక్కడే: చూడు, నిజంగానే, ఇద్దరు మనుషులు ఇంటి పై కప్పు మీదికి ఎక్కి, పొగ గొట్టంలోంచి క్రిందికి జారారు. మొదటివాడు పూర్తిగా స్వచ్ఛంగా బయటపడ్డాడు. రెండోవాడి ముఖానికే, మసి అంటింది. ముఖం ఎవ్వరూ కడుక్కోలేదు- ఎందుకంటే, చెప్పనా?- నువ్వు నన్ను అడగటం మరిచావు- ఆగదిలో ముఖం కడుక్కు-నేందుకు నీళ్లు లేవు!" చెప్పాడు గింజో తాపీగా.

జోకు

## మనందరిది

*సేకరణ: లోహిత్, రెండవ తరగతి, విజ్ఞం స్కూల్.*

(బోర్డు మీద సార్ రాస్తూ వుంటాడు. అపుడు చాక్‌పీస్ పడిపోతుంది.)

**పిల్లవాడు:** సార్! మీ చాక్‌పీస్ పడిపోయింది.

**సార్:** నాది కాదురా మనందరిది.

(కొంతసేపటికి డస్టర్ పడి పోతుంది.)

**పిల్లవాడు:** సార్! మీ డస్టర్ పడిపోయింది.

**సార్:** నాది కాదురా మనందరిది.

(కొంత సేపటికి సార్ భార్య భోజనం పట్టుకొని వస్తుంది.)

**పిల్లవాడు:** సార్! మన భార్య భోజనం తెచ్చింది.

**సార్:** ఆ...ఆ...




# గయ్యాళి అత్త



*మూలం: ఎ.కె రామానుజన్.*

*తెలుగు అనుసరణ: నారయణ, కొత్తపల్లి బృందం.*

అనగా అనగా ఒక ఊళ్ళో సుబ్బమ్మ అనే ఒక గయ్యాళి అత్త ఉండేది. ప్రతి క్షణమూ ఆమె, ఆమె కొడుకు సూరి కలిసి కోడల్ని రాచి రంపాన పెడుతుండేవాళ్లు. ఆ కోడలు సీత, పాపం- ఇంటి పనంతా చేసేది; పశువుల పాకను శుభ్రం చేసేది; బావి నుండి నీళ్ళు మోసుకొచ్చేది; బట్టలు ఉతికేది. ఆ సరికి సాయంత్రం అయ్యేది. ఆలోగా సుబ్బమ్మ, సూరి ఇద్దరూ సొంతంగా వండుకొని తిని, అతుకూ బొతుకూ ఆమెకు పెట్టే వాళ్ళు. సీత తిరిగి పల్లెత్తు మాట మాట్లాడిందంటే చాలు, చీపురు దెబ్బల వర్షం కురిసేది- ఆమె మీద.

అలాంటప్పుడు సీత ఏడిస్తే సుబ్బమ్మ అమెమీద మరింతగా విరుచుకు పడేది- "నీ ఏడుపుతో మా ఇంటికి దరిద్రం తెద్దామనుకుంటున్నావా?" అని. ఆ సమయంలో సూరి గుడ్లు మిటకరించుకొని చూస్తూ ఉండేవాడు తప్పితే, తల్లిని ఏమాత్రం కాదనేవాడు కాదు.

ప్రతి సంవత్సరమూ వాళ్ల ఇంటి పెరడులో ఒక పొట్లకాయ చెట్టు పెరిగేది. పొడవాటి పొట్ల కాయలు అందంగా వ్రేలాడుతూ ఉండేవి, దానినుండి. ఆ పొట్ల కాయల్ని చూస్తే అందరికీ నోట్లో నీళ్ళు ఊరేవి. ఆ సమయం వచ్చిందంటే చాలు- పెద్ద బాన నిండుగా మధురమైన 'పొట్లకాయ తలోదా' వండేది సుబ్బమ్మ. తనూ, తన కొడుకూ తినగల్గినంత తిన్నాక, మిగిలిన కొన్ని ముక్కల్ని మాత్రం కోడలికి ఇచ్చేది. ఆ ముక్కలు సీతకు ఒక్క పంటి కిందికి కూడా వచ్చేవి కావు.

'తనకు ఇష్టమైన తలోదాను కడుపునిండా తినగలిగే రోజు ఎప్పటికి వస్తుందా,' అని సీత ఎదురు చూడని రోజే లేదు.

అలాంటి సమయంలో, ఓ సారి, బయట చెత్త పారేసేందుకు పోయిన కోడలు గాభరాగా పరుగెత్తుకొని లోపలికి కొచ్చింది- పెద్దగా అరుచుకుంటూ:

"ఏమొచ్చింది, అలా రాక్షసి మాదిరి అరుస్తున్నావు? నీకేమైనా పిచ్చిగానీ పట్టలేదు గద!" అన్నది సుబ్బమ్మ చికాకుగా.

"ఇప్పుడే నాకు రోడ్లో పెద్ద మామయ్య ఎదురయ్యాడు - పెద్దత్తకు అరోగ్యం అస్సలు బాగా లేదట! నిన్ను తక్షణం చూడాలంటున్న-దట. నీకోసమే తన ప్రాణాలు నిల్చి ఉన్నాయని చెప్పమన్నదట" అన్నది కోడలు కంగారుగా.

"అయ్యో! మా అక్క! చచ్చిపోతున్నదా! అక్కా, ఓయక్కా! ఇంత కష్టం ఎందుకు వచ్చింది, నీకు?" అని గుండెలు బాదుకుంటూ లేచి బయలు దేరింది సుబ్బమ్మ.

అయితే ఆ సమయానికి తలోదా ఉంది, పొయ్యిమీద. "ఇదిగో పొయ్యి మీద పొట్లకాయ తలోదా ఉంది - దాన్ని జాగ్రత్తగా కలిపి, సరైన సమయంలో క్రిందికి దించు. ఇంటిని బాగా చూసుకో. నేను మా అక్కను చూసేందుకు పోతున్నాను" అని అరుచుకుంటూ, బిగ్గరగా ఏడుస్తూ ఇల్లు దాటిందామె.

కోడలి ఉత్సాహం అవధులు దాటింది. ఇన్నాళ్ళకు చిక్కిన అవకాశాన్ని అమె జార విడుచుకో దలచలేదు. మరుక్షణమే ఆమె

ఇంకొన్ని పొట్లకాయలు కోసింది- మరింత తలోదా చేసుకున్నది. దానితో బాటూ ఇంకా చాలా రకాల వంటలు చేసింది; భర్త సూరికి గొప్పగా విందు చేసింది. సూరికి ఇదేమీ అర్థం కాలేదు గానీ, ఏమీ అనలేక ఊరుకున్నాడు.

ఆతర్వాత, తలోదాని మొత్తాన్నీ ఒక పెద్ద బానలోకి పోసుకొని, చెరువునుండి నీళ్ళు తెచ్చేందుకు పోతున్నట్లు ఆ బానను నడుం మీద పెట్టుకొని, ఊళ్ళోకి పోయింది సీత.

అలా పోయిన కోడలు పిల్ల, నేరుగా ఊరి చివరన ఉన్న కాళికాదేవి గుడికి పోయింది. గర్భ గుడిలోకి దూరి, తలుపు వేసేసుకున్నది. ఆపైన ఆమె ఒక్కతే కాళీమాత విగ్రహం ముందు బైఠాయించి కూర్చొని, బానెడు తలాదానూ ఏక బిగిన- లాగించి తినేసింది!

ఆ సమయంలో గర్భగుడిలో వేరే ఎవ్వరూ లేరు గాని , కాళీమాత అయితే ఉన్నది గదా! "ఈ పిల్ల ఒక్కతే బానెడు తలాదాను ఎలా తిన్నది?" అని ఆ కాళీమాతే నివ్వెరపోయింది. సీత తలాదాను తిన్న వేగాన్నీ, ఆమె మింగిన మొత్తాన్నీ చూసి, కాళికాదేవి ఏమైనా అందామనుకున్నది. అయినా ఏమీ అనలేక , కుడిచేత్తో గట్టిగా తన నోరు నొక్కుకున్నది కాళికమ్మ.

అయినా కోడలు పిల్ల ఇవేమీ ఆలోచించే స్థితిలో లేదు. 'తనకు ఎంతో ఇష్టమైన తలాదా- తనను ఇన్నేళ్ళుగా ఊరించిన తలాదా- ఇప్పటికి గదా, తనకు అందింది?' అని, ఆమె మెక్కటంలోనే మునిగింది. చివరికి, బాన ఖాళీ అయ్యేసరికి , ఆమె గట్టిగా ఓసారి త్రేన్చి, ఖాళీ బానను శుభ్రం చేసేందుకని, చెరువు దగ్గరికి పోయింది.

బానను కడుక్కొని, నీళ్ల నింపుకొని సీత వెనక్కి వచ్చేసరికి, ఇంటి వాకిలి మూసి ఉన్నది! -అత్త వెనక్కి వచ్చేసింది!

తలుపు తీసీ తీయగానే సుబ్బమ్మ కోడల్ని నానా తిట్లూ తిడుతూ, గొడ్డు ను బాదినట్లు బాదింది. సూరి ఇంటికి వచ్చాక, తల్లి కోపం అతనికీ అంటింది- అతనూ సీతకు నాలుగు వడ్డించాడు.

ఆలోగా పట్టణంఅంతా ఆశ్చర్యకరమైన వార్త ఒకటి వ్యాపించింది: 'గుడిలో కాళీమాత- కుడిచేత్తో- తన నోటిని మూసుకున్నది!' అని. "ఆ తల్లికి కోపం వచ్చింది- ఇక వానలు పడవు. గ్రామంలో ఇక పిల్లలన్న వాళ్ళే పుట్టరు" అని వదంతులు వినిపించాయి. ఈ వింతను చూసేందుకు పొరుగు గ్రామాల నుండి కూడా భక్తులు, వేల సంఖ్యలో రాసాగారు. ఎవరికి వాళ్ళు ఈ సంఘటన ఫలితాల్ని ఊహించి చెప్పటం మొదలుపెట్టారు.




ఎవరిని చూసినా 'ఇది చాలా దుశ్శకునం' అనేవాళ్ళే. "గ్రామానికి ఏదో తెలీని ఆపదరానున్నది" అని అందరూ భయపడ్డారు. "ఎవరో గుడిని అపవిత్రంచేసారు. అందుకనే, కాళీమాత తన చేత్తో తనే నోరు మూసుకున్నది" అన్నారు అంతా. ఇక గ్రామమంతటా పూజలూ, పునస్కారాలూ, తంతులూ జరిగాయి. జాతరలు జరిపి, గొర్రెల్ని బలి ఇచ్చారు అమ్మవారికి. కానీ ఏం చేసినా కాళీమాత మాత్రం కరుణించలేదు. నోటి మీదినుండి చెయ్యి తీయలేదు.

చివరికి ఊరి పెద్దలు ఊరంతటా చాటింపు వేయించారు- "కాళీమాత తన చేతిని నోటి మీది నుండి తీసేసేట్లుగా చేసిన వాళ్ళకు గొప్ప బహుమతినిస్తాం' అని. అయినా కాళీమాత చేత ఆ పని చేయించేందుకు ఎవ్వరూ ముందుకు రాలేదు.

మాట్లాడకుండా ఈ గందరగోళం మొత్తాన్నీ గమనిస్తూ కూర్చున్న సీతకు చికాకు వేసింది. చివరికి ఆమె అత్త దగ్గరికి వెళ్ళి, "అత్తా! 'కాళీమాత చేతిని నోటిమీద నుంచి తీసేసేట్లు మనం చెయ్యగలం' అని చెప్పు, వాళ్ళకు. నాకు తెలుసు, అదెలాగో!" అన్నది.

మొదట్లో కోడలుమాటల్ని నమ్మలేదు సుబ్బమ్మ. "చూడు, ఈ వెర్రి దాన్ని! ఊళ్ళో నా పరువు తీయాలని దాని ఆలోచన కాబోలు! ఏదో తనకే మంత్రాలు వచ్చినట్లు, గొప్పగా వ్యవహరిద్దామని చూస్తూన్నట్లుంది! ఎవ్వరూ చేయలేని పనిని, ఇది ఎట్లా చేయగలదు?" అన్నది. కానీ కోడలు మళ్ళీ-మళ్ళీ అనేసరికి, ఆమె కొంచెం అనుమానంగానే, ఒప్పుకున్నది.

మరుసటి రోజున కోడలు పిల్ల తన చింత ఈనెల చీపురుకట్టను, నిండుగా ఉన్న చెత్త బుట్టను తీసుకొని, గుడికి వెళ్ళింది. అందరినీ బయటికి పంపించి,తను గర్భగుడి లోపల గొళ్ళెం పెట్టుకున్నది. ఆపైన ఆమె తన చెత్త బుట్టను విగ్రహం ముందు పెట్టి, చీపురుకట్టను కోపంగా ఊపుతూ కాళికాదేవిని బెదిరించింది- "ఏమ్మా నీకంత అసూయ? నా పొట్లకాయ తలాదాను నేను తింటే, నీకేంటి? నీ కళ్ళలో నిప్పులెందుకు పోసుకుంటావు? నీకే గనక అంత ఆశ పుట్టి ఉంటే, నన్ను అడగాల్సింది, నేను నీకూ కొంచెం పెట్టేదాన్ని కద! అంత గొప్ప తల్లివి, నీకింత కళ్ళు మంట ఎందుకు? మర్యాదగా ఇప్పటికైనా నోటి మీది నుండి ఆ చెయ్యి తీస్తావా, లేకపోతే ఈ బడితతో పూజ చెయ్యమంటావా? చెప్పు!" అని అరిచింది.

అయినా విగ్రహం ఉలకలేదు, పలకలేదు. కోపం ఆపుకోలేక, సీత విగ్రహానికి దగ్గరగా వెళ్ళి, తన చీపురుకట్టతో నాలుగు అంటించింది. మరుక్షణంలో కాళీమాత 'కుయ్యో-మొర్రో-అయ్యో' అని, నోటి మీది నుండి చెయ్యిని తీసేసింది. ఇప్పుడు విగ్రహం యధావిధిగా, పవిత్రంగా కనబడుతున్నది మళ్ళీ.

కోడలు ఆమెను కొట్టటం ఆపి,"అద్దీ, అలా ఉండాలి!" అని గొణుక్కొని, తన చెత్తబుట్టను చేత బట్టుకొని, చక్కా పోయింది.

క్షణాల్లో ఊరంతటికీ కోడలు పిల్ల సీత గురించీ, ఆమె సరిదిద్దిన కాళీమాత చెయ్యి సంగతీ తెలిసిపోయింది. అందరూ గుడికివెళ్ళి చూశారు- కాళీమాత మునుపటి మాదిరే నాలుగు చేతులతో ఇంపుగా ఉండటం చూసి,

అందరూ తల్లికి మ్రొక్కి, బయటకి పరుగెత్తారు. ఆపైన అందరూ సీతను దర్శించుకొని, ఆమెకూ మ్రొక్కుకున్నారు.

ఊళ్ళో జనాలంతా ఆమెను 'పతివ్రతా శిరోమణి' అని పొగిడి, 'ఆమెను చూస్తే చాలు- తమ పాపాలన్నీ పటాపంచలు అవుతున్నాయ అన్నట్లు మాట్లాడారు. ఆమెకు అనేక బహుమానాలు, చాలా డబ్బు, ఇచ్చి సత్కరించారు కూడాను.

అయితే అత్త సుబ్బమ్మకు మాత్రం, ఈ సంఘటన తర్వాత ఏదో తెలీని భయం పట్టుకున్నది. 'తన కోడలికి మాయ మంత్రాలేవోవచ్చు' అని ఆమెకు భయంవేసింది. 'తన అత్త తనను ఎంతగా పీడించిందో సీత ఏదో ఒకనాడు గుర్తు తెచ్చు కోకుండా ఉండదు! అప్పుడు ఆమె తననూ, తన కొడుకు సూరిని కూడా- వదిలిపెట్టదు' అని సుబ్బమ్మ వణికిపోయింది.

"ఆలోగానే మనం ఏదైనా చెయ్యాలి!" అనుకున్నదామె.

అదే సంగతి సూరిని అడిగితే, ఆ పిరికివాడు "నాకేమీ తెలీదు-నువ్వేచెప్పు"అనేశాడు.

"అది ఇప్పుడు పడుకొని ఉన్నది. మనం దాని నోట్లో గుడ్డలు కుక్కి, చాపలో మడిచి కట్టి, దాన్ని పొలంలో గుంత దగ్గరికి ఎత్తుకు పోయి, కాల్చేద్దాం. ఆ తర్వాత నేను నీకు ఒక మంచి, కొత్త భార్యను తెచ్చి పెడతాను"అన్నది సుబ్బమ్మ గయ్యాళిగా.

"సరే! సరే! ఆపనేదో వెంటనే చేసేద్దాం" అన్నాడు- సొంత ఆలోచన లేని కొడుకు.

వెంటనే ఇద్దరూ కలిసి నిద్రపోతున్న సీత నోట్లో గుడ్డలు కుక్కి, ఆమెను చాపతో సహా చుట్ట చుట్టి, ఎత్తుకు పోయారు. వాళ్ళ పన్నాగం అర్థమై కూడా సీత కదలక, మెదలక పడుకున్నది.

పొలం చేరుకోగానే చాపచుట్టను గుంతలో పెట్టి, సుబ్బమ్మ, సూరి ఇద్దరూ కట్టెలు తెచ్చేందుకని పోయారు. కోడలు అప్పటికి ధైర్యం తెచ్చుకొని, కొంచెం బిగుసుకు పోయినట్లు చేసి, అలా చాపను వదులు

చేసుకొని, బయటపడింది.

ఆపైన నోట్లో కుక్కిన గుడ్డల్ని తీసేసుకొని, ఆమె అక్కడ ఉన్న కట్టె మొద్దును ఒకదాన్ని చాపలో దూర్చి పెట్టింది. తను దూరంగా నడుచుకొని పోయి, ఓ మర్రి చెట్టు కనబడితే, దాని పైకి ఎక్కి కూర్చున్నది.

అంతలో వెనక్కి వచ్చిన తల్లీ కొడుకులిద్దరూ చెత్తా, చెదారం, కట్టె పుల్లలూ అన్నీ చాప చుట్టూ పేర్చి కాల్చేశారు. కట్టెలకణుపులు వేడికి పగిలి, 'టప టప' అన్నప్పుడల్లా వాళ్ళు "అదిగో, ఎముకలు- ఎముకలుచిట్లి పోతున్నై!" అనుకున్నారు. మధ్యలో ఓసారి, ఒక పెద్ద కట్టె కాలి, 'ఫట్'మని పగలగానే, "హమ్మయ్య! ఇప్పుడు దాని కపాలం కూడా పగిలింది" అని సంబరపడి, వాళ్లిద్దరూ ఆ అర్ధరాత్రి వేళ- పడుతూ లేస్తూ- ఇంటికి పోయారు.

ఇక సీత మాత్రం చేసేదేమీలేక, ఆ రాత్రికి అక్కడే, చెట్టు కొమ్మల మాటున- ముడుచు-కొని కూర్చున్నది. అదే రోజు రాత్రి నలుగురు దొంగలు, తాము దోచుకున్న డబ్బుల్ని, ఆభరణాల్ని పంచుకునేందుకని వచ్చి, ఆ చెట్టు క్రిందే కూర్చున్నారు. వాళ్లు అక్కడ కూర్చోగానే, అల్లంత దూరాన మండుతున్న కట్టెలు కనబడ్డాయి. 'ఆ మంట దగ్గర ఎవరైనా ఉన్నారేమో' అని వాళ్లకు అనుమానం వేసింది.

సందేహ నివృత్తి కోసం, వాళ్లలో ఒకడు చెట్టు పైకి ఎక్కి, సరిగ్గా కోడలు కూర్చున్న కొమ్మమీదికే వచ్చాడు. అక్కడ ఈ స్త్రీ ఆకారాన్ని చూసి వాడు ఒక్క క్షణం బిత్తరపోయి, "ఎవరది?" అన్నాడు మెల్లగా.

కోడలుపిల్ల వెంటనే "ష్..గట్టిగా మాట్లాడకు. నేనొక దేవకన్యను. నాకు కాబోయే భర్తను వెతుక్కుంటూ ఇప్పుడే ఇక్కడికి వచ్చి వాలాను. నిన్ను చూస్తే చాలా మంచి వాడివి లాగున్నావు. నువ్వు సరేనంటే, నిన్ను పెళ్లిచేసుకొని, నువ్వు కలలో కూడా చూడని సంపదల్ని నీ వశం చేయగలను. మెల్లగా మాట్లాడు!" అన్నది వాడితో.

తాగిన మత్తులో ఉన్న ఆ దొంగకి, తనెక్కడ ఉన్నదీ అర్థం కాలేదు. 'తను స్వర్గం చేరుకొని,

ఐరావతం మీద ఎక్కి కూర్చొని, ఊరేగు-తున్నట్లు' అనిపించింది వాడికి. "నువ్వు నిజమా, లేక నా భ్రాంతా?" అన్నాడు వాడు.

"పదహారణాల నిజం. కావాలంటే- ఇదిగో, ఈ వక్కాకు తిను!"అని, సీత తన రొంటికున్న సంచీలోంచి రెండు తాంబూలాలు తీసి, తనొకటి నోట్లో వేసుకుని, వాడికొకటి ఇచ్చింది. ఆపైన ఆమె వాడికి తన నాలుకను చూపించి, వాడి నాలుకను చూపించమన్నది. మైకంలో ఉన్నట్లు, వాడు తన నాలుకను చాచగానే సీత మొండిగా ముందుకు వంగి, వాడి నాలుకను అందినంతమేరకు కొరికివేసింది!

వాడు "బబ్బబ్బబ్బ!" అని అరుస్తూ, గయ్యని కేకలు పెడుతూ, బాధను భరించలేకపట్టు తప్పి, క్రింద కూర్చున్న తనవాళ్ల మీదనే పడ్డాడు. ఏదో లోకంలో ఉన్న ఆ దొంగలుకూడా కంగారు పడి, తలొక దిక్కుకూ పరుగెత్తారు. నాలుక తెగిన వాడు "బబ్బబ్బబ్బ" అని అరుస్తూ వాళ్ల వెంట పరిగెత్తితే, మిగిలిన వాళ్ళకు మరింత హడలైంది. వాళ్ళు బాణాలు దూసుకు పోయినట్లు, దిక్కులు చూసుకోకుండా పరుగెత్తారు. వాడు కూడా అరుస్తూ వాళ్ల వెంబడి పరుగు తీశాడు.

తెల్లవారుతుండగా కోడలు పిల్ల చెట్టు దిగి చూస్తే, ఏముంది? చెట్టు క్రింద- పెద్ద గోతం నిండుగా- డబ్బు! బంగారం! వెండి! ఆభరణాలు! ఆమె వెంటనే వాటినన్నింటినీ మూట గట్టుకొని, నేరుగా ఇంటికి పోయి, తలుపు తట్టింది- "అత్తా! ఓ అత్తా! తలుపుతియ్యి!" అంటూ.

అత్త సుబ్బమ్మకు గుండె ఆగినంత పనైంది. నోరు పిడచగట్టుకుపోయింది. ముఖం పాలిపోయింది. అయినా ధైర్యం చేసి తలుపు తీసి చూసేసరికి, తను స్వయంగా కాల్చేసిన కోడలు- ఇకిలిస్తూ నిలబడి ఉన్నది- కళ్లకెదురుగా.

మరుక్షణం అత్త భయంతో మూర్ఛపోయింది. కోడలే ఆమెను లోపలికి ఎత్తుకెళ్లి, ముఖం మీద నీళ్లు చిలకరించి,

సేవలు చేసింది. సూరి నోరు తెరుచుకొని అక్కడే నిలబడిపోయాడు శిలావిగ్రహంలాగా.

కళ్లు తెరవగానే అత్త- "నువ్వు- నువ్వు- ఎలా- ఇంకా బ్రతికే ఉన్నావా...? లేకపోతే..?" అని గొణిగింది.

"మీరు నన్ను కాల్చేయగానే, యమ-దూతలు వచ్చి నన్ను యముడి దగ్గరికి తీసుకెళ్ళారు. ఆయన కళ్ళు చింత నిప్పుల్లాగా ఎర్రగా మండుతున్నాయి- అచ్చం మన కాళీమాత కళ్లలాగానే.

నన్ను చూసీ చూడగానే ఆయన గర్జించాడు "ఈమెను వెనక్కి పంపండి. ఈమె అత్తే, అసలైన పాపి! ఆమెను లాక్కురండి ఇక్కడికి. ఇనప కాకికి ఆ దొంగ అత్త పని అప్పగించండి. అది ఆమె శరీరాన్ని ముక్కలు ముక్కలు చేయాలి. ఆ తర్వాత ఆ పాపిని కాగే నూనెలో వేయించండి" అని, పిడుగులు పడ్డట్టు, ఏమేమో అరిచాడు నీ గురించి.

నేను అప్పుడు ఆయన పాదాలపై పడి, "మా అత్తను అలా చేయకండి, దయచేసి ఆమెను క్షమించండి. నిజానికి ఆమె ఏమంత చెడ్డది కాదు. మీరు ఏ శిక్ష విధించాలన్నా, నాకు విధించండి- మా అత్తను మాత్రం ఏమీ చేయకండి" అని ప్రార్థించాను.

నా మాటలు విని ఆయన కొంచెం శాంతించాడు- ఒక చిరునవ్వు నవ్వాడు కూడా- "నువ్వు ఇక వెనక్కి తిరిగి వెళ్లు. నువ్వు చెప్పినట్లే చేస్తాములే. కానీ ఒకవేళ మీ అత్త ఇకమీదట నిన్ను ఏమైనా అన్నదనుకో, ఆమెను నేనే స్వయంగా నరకానికి లాక్కు వెళ్తాను. మా భటులు ఎల్లవేళలా ఆమెను గమనిస్తుంటారు" అన్నాడాయన.

ఆ తర్వాత ఆయనే నాకు ఈ నగలు, బంగారం, డబ్బులు అన్నీ ఇచ్చి, సాగనంపారు. జనాలు యముడి గురించి చెడుగా ఏవేవో చెబుతుంటారు గానీ, ఆయన నా పట్ల ఎంత దయతో వ్యవహరించారో చెప్పలేను" అన్నది సీత అమాయకంగా.

అత్త వణికే గుండెతో, భయం భయంగానే ఆమెను కౌగిలించుకున్నది- "అయ్యో! నువ్వు

నిజంగానే మా ఇంటి దేవతవు. యమదూతల బారినుండి నన్ను కాపాడింది నువ్వే. ఇప్పటినుండీ ఈ ఇంట్లో నువ్వు ఎలా చెబితే అలా చేస్తాం. నా పాపాలేవీ మనసులో పెట్టుకోకు. క్షమించేసెయ్ నన్ను. క్షమిస్తావు గదూ, నా బంగారు తల్లీ?" అని ప్రాధేయపడింది కోడల్ని.

ఇప్పుడు కోడలు పిల్లే ఆ ఇంటికి పెద్ద. సుబ్బమ్మా, సూరీ ఆమె ఏం చెబితే అది చేస్తున్నారు. అందరూ సుఖంగా ఉన్నారు!

**పొడుపు కథలు**

సేకరణ: యన్. సింహాచలం, యన్. శశి, టింబక్టు.

1. నల్లరాయి కింద నలుగురు దొంగలు. ఎవరు?
2. కీకీ పిట్ట - నేలకేసి కొట్ట. ఏంటది?
3. పిల్ల తిరుగుతుంది తల్లి తిరగదు
4. కూతురుకు కనుము ఉంటుంది. పిన్నమ్మకు కనుము ఉంటుంది. పిల్లకి కనుము ఉంటుంది. తల్లికి కనుము ఉండదు. ఏమిటా కథ?
5. ఒంటి కాలోడు- వర్షామెళ్ళినాడు. ఏంటది?
6. గది నిండా పప్పు- గదికి తాళం. ఏంటది?

*(జవాబులు: 1. ఎనుము 2. చీమిడి 3. తిరగలి (విసుర్రాయి) 4. సూది, దబ్బనం, గడారు(గడ్డపార) 5. పుట్టగొడుగు 6. వంకాయ)*

# ఈ బొమ్మకు కథ రాయండి



నిర్వహణ: *లలిత*, telugu4kids.com.

| | |
|---|---|
|  | కథ పేరు:<br><br>ఈ కథలో ప్రదేశాలు:<br><br>ఈ కథలో పాత్రలు:<br><br>ఈ దృశ్యానికి ముందు ఏమి జరిగింది? |

ఈ దృశ్యంలో ఏం జరుగుతోంది?

చివరికి ఏమైంది?

ఈ వివరాలన్నీ తెలుపుతూ ఒక చక్కని కథ రాసి పంపండి.

మా చిరునామా: **"కొత్తపల్లి" తెలుగు పిల్లల ఈ (e) మాసపత్రిక**

**ఇంటి నెం: 2 - 312**

**న్యామద్దల రోడ్డు, చెన్నేకొత్తపల్లి,**

**అనంతపురం జిల్లా , 515101**

**ఆంధ్రప్రదేశ్.**

# పాటలు

## బూచోడు

*గానం: కీర్తన, యు.కె.జి, విజ్ఞంస్కూల్, గుడిపాల, చిత్తూరు జిల్లా.*



బూచోడమ్మా బూచోడు

బుల్లిపెట్టెలో ఉన్నాడు

కళ్ళకెపుడు కనపడడు

కబుర్లెన్నో చెబుతాడు

(ఇంతకీ ఎవరా బూచోడు? **టెలిఫోన్!**)

## గుడ్ మార్నింగ్ సార్!

*డి. అనీశ్, 5 వతరగతి, విజ్ఞంస్కూల్.*



గుడ్‌మార్నింగ్ సార్

గుండెనొప్పి సార్

సలాం సలాం సార్

సంక నొప్పిసార్

## సూరి - పూరి

నాపేరు సూరి

తిన్నాను పూరి

ఎక్కాను లారి

పడ్డాను జారి

గుచ్చుకుంది సూది

ఇదే నా స్టోరి.

## మామిడి పండు



*కె.లోహిత, యుకెజి, విజ్ఞంస్కూల్.*

మామా మామా మామిడి పండు

తాత గుండు గుమ్మడి పండు

మామ గారు వచ్చిన్రు

అల్లం బెల్లం తెచ్చిన్రు

రాయి నెత్తిన ఎత్తిన్రు

కాలి జారి పడిన్రు, కర్ర చేత పట్టిన్రు!

# చదువు

*గానం: విజ్ఞంస్కూల్ పిల్లలు, గుడిపాల, చిత్తూరు జిల్లా.*



చదువుకో చదువుకో అక్షరాలు నేర్చుకో

కళ్ళున్నా చూడలేని వాస్తవాలు తెలుసుకో

చదువుకుంటే గుండె బలం

చదువుకుంటే బుద్ధి బలం

చదువుకుంటే చీకట్లను

జయించే మహాబలం

# భలే తాత

*గానం: బి.చిత్రలేఖ, యం.కీర్తన, యు.కె.జి. విజ్ఞంస్కూల్.*




భలే తాత బాపూజీ , బాలల తాత బాపూజీ

బోసి నవ్వుల బాపూజీ

చిన్న పిలక బాపూజీ

కులమత భేదం వలదన్నాడు

కలిసి బతకితే బలమన్నాడు

మానవులంతా ఒకటన్నాడు ,మనలో జీవం పోశాడు

# గజ్జెలు

గానం: టింబక్టు బడిపిల్లలు,చెన్నేకొత్తపల్లి.

గజ్జెలు గజ్జెలు గలగల గజ్జెలు

చిన్నారి కాలికి బంగారు గజ్జెలు

మామ తెచ్చిన మా మంచి గజ్జెలు

పాపకు నచ్చిన మేలిమి గజ్జెలు

బుడి బుడి నడకలు పాపాయి నడువ

కాలి గజ్జెలుగల గల మ్రోగేను

అడుగు కదిపి నాట్యం చేయగ

వంతుగ గజ్జెలు తాళం వేసేను

తమ్ముడు చిలిపిగా పాపను చేరి

గజ్జెలు తనకు ఇమ్మనగా

పాప పరుగుతో అమ్మను చేరె

మురిసి గజ్జెలు గలగల లాడెను



## కొత్తపల్లి బృందం


**సారధ్యం:** సుబ్బరాజు

**ప్రధాన సంపాదకులు:** నారాయణ

**సంపాదక వర్గం:** మోహనయ్య, జయచంద్ర, మురళి.

**సాంకేతిక బృందం:** ఆనంద్, లక్ష్మి, లీల.

**చిత్రాలు:** అడవిరాముడు, సుచరిత.

**రూపకల్పన:** సుచరిత, రాజకుమార్

**ఆర్థిక వ్యవహారాలు:** అలివేలమ్మ




## చందా వివరాలు

**సంవత్సర చందా:** 200/ రూ.

చందాను 'కొత్తపల్లి ట్రస్టు' పేరిట మనీఆర్డర్ లేదా డి.డి లేదా చెక్కు రూపంలో కట్టవచ్చును. డి.డి., చెక్కులకు బ్యాంకు చార్జీలు (25రూ) కలపాలని మనవి.

**చందాలకై చిరునామా:**


కొత్తపల్లి ట్రస్టు,
2-312, న్యామద్దల రోడ్డు, చెన్నేకొత్తపల్లి,
అనంతపురంజిల్లా, 515101.


**బ్యాంకు ద్వారా చందా కట్టడానికి వివరాలు:**

సి.ఎచ్. రాము, A/c No:62079470871,
స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు, శాంతి నగర్ బ్రాంచి, హైదరాబాద్.

డబ్బు కట్టిన వివరాలను ఇ మెయిలు/ ఫోను/ ఉత్తరం ద్వారా కొత్తపల్లికి తెలియపరచగలరు.


ఇ మెయిలు: team@kottapalli.in
ఫోను: 08559 240222.



**కృతజ్ఞతలు:**

పత్రికకోసం నిరంతరంగా పిల్లల రచనల్ని అందించి సహకరిస్తున్న ప్రకృతిబడి, టింబక్టు బడి, విజ్ఞం స్కూల్ యాజమాన్యాలకు కృతజ్ఞతలు. వెబ్ సైటుకు వెన్నుదన్నుగా నిల్చిన infogami యాజమాన్యానికి, దాన్ని సుసాధ్యం చేసిన python భాషకు, చక్కని ఆపరేటింగ్ సిస్టం linux ను అందించిన ubuntu వారికి, గొప్ప వ్యవస్థని పూర్తిగా ఉచితంగా అందిస్తున్న OpenOffice వారికి, తెలుగును రప్పిస్తున్న Unicode, Scim, Baraha లకు, చిత్రాలను సరిదిద్దే Software Gimp నిర్మాతలకు, శబ్దాలను చక్కబరచే Software Audacity నిర్మాతలకు కృతజ్ఞతలు.

మంచి పుస్తకం:

# మేం పిల్లలం

*అఆఇఈ నేర్పండి అయ్యవారూ!*
*హ్క్షదంక అక్షరాలు యాభై ఆరూ!*
*ఉయ్యాల జంపాల ఉఊబుబూ*
*ఎక్కడ, ఏవీ? ఎఏఐ*
*ఒహో! ఓహో! ఒఓఔ*
*అంమ్మమ్మమా! అః హహ్హాహ్హా!*

ఇలా సాగే యాభైఆరక్షరాల తెలుగు పాట, విన్నారా, ఎప్పుడైనా?




*ఊరు ఊరు మా ఊరు*
*ఊరి ముందర మా తోట*
*తోట లోన జామి చెట్టు*
*చెట్టు మీద చిలకమ్మ*
*చిలక పేరు సీతమ్మ*
*సీత జడలో చామంతి!*

*ప్రచురణ: పాలపిట్ట*
*పేజీలు: 170*
*వెల: 100 రూపాయలు*

ఈ చిన్నారి బాలగీతం విని మురిసారా, ఎప్పుడైనా?

ఇవే కాక, మరో నూటయాభైకి పైగా పాటల సంకలనం, "మేంపిల్లలం " పుస్తకం. పెద్ద అచ్చుతో, చక్కని బొమ్మలతో, పిల్లలూ పెద్దలూ కూడ బిగ్గరగా పాడుకునేందుకు వీలైన చిట్టి పాటల సంగ్రహం మేంపిల్లలం.

జై సీతారాం తాత బళ్ళో పిల్లలతో ఆడుకొనీ, ఆడుకొనీ తయారుచేసుకున్న పాటలివి. వీటిలో తెలుగుదనం ఉంది, పిల్లల ఆత్మ ఉంది, తిరుగుబాటు ఉంది, మా రాము - బుజ్జగింతలు ఉన్నై, అన్నింటినీ మించి సంతోషమూ, కేరింతలు ఉన్నై. పిల్లలు తెలుగును ఇష్టపడాలంటే వాళ్ళకు ఇలాంటి పాటలు నేర్పితీరాలి - బళ్ళోనో, ఇంట్లోనో వాళ్ళకు ఈ పుస్తకం అందుబాటులో ఉండాలి.